




సెప్టెంబరు **1980**
సంచికలో
అందించబడిన
పూర్తి నవల





# వెలుతురులో చీకటి

రచన :

నెల్లూరి కేశవస్వామి

ఆ రోజు దీపావళి.... ఇంటి ముందు అంతా టపాకాయలతో గగ్గో
వుంది. పెద్ద పిల్లలు రజనీ, రవీ ఆవరణలో టపాకాయలు
స్తున్నారు. నేను గుమ్మంలో నిలుచుని, చంకలో వున్న చి
కాకరవత్తులు కాల్పిస్తున్నాను....

ఇంతలో రజనీ, రవీ 'నాన్నా! నాన్నా!' అన్న అరవడం వి
పించింది. ఉలిక్కిపడి చూశాను.... అవును, వాపే.... నా వాసు! వాకిట్లో
నిలుచుని తదేకంగా నాకేసే చూస్తున్నాడు, చిరునవ్వుతో.... సం
మాశ్చర్యాలతో ఒకసారి నా వొళ్ళంతా కంపించిపోయింది. క్షణ
పాటు నేనూ నిశ్చేష్టగా వాసు కళ్ళల్లోకి చూస్తూ నిలుచుండిపోయాను.
పిల్లలిద్దర్నీ యెత్తుకుని ముద్దులాడుతున్నాడు వాసు. కాని.... కాని ఇ
లోకి నా కళ్ళెదట ఇన్‌స్పెక్టర్ రాజశేఖర్ ప్రత్యక్షమయ్యాడు. తా
జువ్వలా ఉవ్వెత్తున లేచిన నా ఉత్సాహమంతా చప్పున చల్ల
పోయింది. వెంటనే, "రవీ! రజనీ!" అంటూ కేకేసి ఇంట్లోకి వ
శాను. మంచంమీద చతికిలబడ్డాను.... గుండె కొట్టుకుంటోంది, ఉ
వేగంగా కొట్టుకుంటోంది.... కాసేపటికి ఇద్దరు పిల్లలూ లో
కొచ్చారు, బిక్కమొహాలు వేసుకుని. "అమ్మా! నాన్న, నాన్న
అంటూ ఏమేమో చెబుతూన్నారు. నేను వినే స్థితిలో లేను. గుమ
కేసి చూస్తూ కూచున్నాను. 'వొస్తాడు, వాసు వొస్తాడు' అన్న
గుండె దడతో కొట్టుమిట్టాడుతోంది. కాని రాలేదు, ఎంతకూ రా
వాసు. పిల్లల మారాం యెక్కువైంది. ఆఖరికి విసుగెత్తి వా
బొమ్మని కసిరాను. పరుగెత్తారు. చిట్టికూడా రాగం తీసింది, బయ
చూపిస్తూ.. విధిలేక లేచాను. గుమ్మందాకా వెళ్ళి తొంగిచూశా
లేడు, వాసు లేడు.... నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అలానే శూ
లోకి చూస్తూ నిలుచుండిపోయాను. నా లోకం అంధకారబంధు
పోయింది. జ్ఞాపకాల జ్యోతులు ఒక్కొక్కటే వెలగటం
లెట్టాయి....

నేను కాలేజీలో చేరిన మొదటి రోజులు గుర్తుకొచ్చా
స్కూలు పైనల్ పరీక్షలో రాష్ట్రానికంతకూ ఫస్టులో పాసయా

ఎటు వెళ్ళినా 'గోఖలే స్కాలర్ రమ' అన్న గుసగుసలు వినిపించేవి
గర్వంతో ఉప్పొంగిపోయేదాన్ని. యెవర్నీ ఖాతరుచేసేదాన్ని కాదు,
ముఖ్యంగా మగపిల్లల్ని.

ఒకరోజు నా క్లాసుమేట్ వనజాక్షి మా ఇంటికొచ్చింది.

"చూడు రమా! నీతో ఒక ముఖ్య విషయంలో సలహా అడగటాని కొచ్చాను" అంది.

"ఏవిఁటి?"

"....వాసు పేరు విన్నావా?"

"ఏ వాసు?"

"అంటే, విన్లేదన్న మాట. ఫరవాలేదు. మన కాలేజీలో బియస్సీ పైనల్ చదువుతూన్నాడు. చాలా తెలివైనవాడు. ప్రతియేటా ఫస్టు వస్తుంటాడు."

"ఊఁ"

"కాని యెంతటి తెలివిగలవాడో అంతటి బీదవాడు కూడాను. ఇన్నాళ్లూ కాలేజీ వాళ్ళు ఇచ్చే స్కాలర్‌షిప్పుతోనూ, అప్పులతోనూ గడుపుతూ వచ్చాడు. ఇప్పుడిక దుర్భరమైపోయింది. చదువు మానేస్తానంటున్నాడు...."

"అదే మంచిది."

"ఆఁ!" చకితురాలై చూస్తోంది వనజ.

"అవును, చదివే స్తోమత లేనివాళ్ళు యెందుకు చదవాలి? మానేసి, ఏదైనా ఉద్యోగం చేసుకుని బ్రతకొచ్చుగా?"

క్షణంసేపు నాకేసి అదో విధంగా చూసి అంది వనజ, "హుఁ, యెంత తేలిగ్గా తేల్చేశావు రమా!....అసలు చదివితే అలాంటివాళ్ళే చదవాలి. దేశానికీ, ప్రపంచానికీ ప్రయోజనం. నువ్వూ, నేనూ చదివి ఏం లాభం? ఆఖరికి పెళ్ళి చేసుకుంటాం, అంతేగా?"

"ఉహుఁ, నేనలా చెయ్యను."

"మరి?"

"ఉద్యోగం చేస్తాను,"

"చేసి యెవర్ని ఉద్ధరిస్తావు? అంతకంటే, ఉద్యోగం చేసుకునే వరుణ్ణి చేసుకుంటే పోలా? ఆడదానికి ఇంటి ఉద్యోగమే చాలు."

"ఈ బూజు పట్టిన భావాల్తో నాకేం పనిగాని, ఇంతకూ నేను ఇవ్వాల్సిన సలహా ఏఁవిటో చెప్పావు కావు."

"చెబుతున్నాను. మరో అయిదారు నెలలపాటు నెలకు యాభై, అరవై రూపాయలు సర్దితే...."

"నేనా?"

"నువ్వొక్కర్తివే కాదు. నీలాంటి డబ్బుగల అమ్మాయిలు నలుగురి దగ్గిర అర్థించాలని అనుకుంటున్నాను."

"బావుంది పథకం....ఇంతకూ, నీకూ ఆయనకూ ఏఁవిటో సంబంధం?"

వనజ కొద్ది క్షణాలు మౌనంగా కూచుని అంది. "నిజం చెబితే నమ్ముతావా రమా?"

"ఎందుకు నమ్మను?"

"....ఏ సంబంధమూ లేదు"

"అంటే?"

"అంతే."

"బావుంది వరస."

"వరసలకేంగాని రమా! ఏమంటావో చెప్పు. నీకిచ్చే స్కాలర్‌షిప్పు డబ్బు నిజంగా నీకు అవసరమై వుండదు. అందులో కొంత భాగం ఇచ్చినా చాలు...."

"ఉహూఁ, అలాంటి పిచ్చిపన్లు చెయ్యదలచుకోలేదు."

"అంతేనంటావా?"

"అంతే."

కొంచంసేపు నిశ్శబ్దంగా, తలవంచుకుని కూచుని, మారో మాట్లాడకుండా వెళ్ళిపోయింది వనజ.

ఆ తర్వాత వనజ నాకు దూర దూరంగా, ముభావంగా వుంటూ వచ్చింది. అనతి కాలంలోనే నేనంతా మరిచిపోయాను.

## 2

మరో నాలుగు నెలల తర్వాత ఒకరోజు నేను యింట్లో లేనప్పుడు వనజాక్షి వచ్చి నా కోసం నా గదిలో చాలా సేపు కూచుని వెళ్ళిందట. యెందుకో తెలీదు....కాని, అదే రోజు డ్రెసింగ్ టేబిల్ మీద పెట్టిన నా ఉంగరం పోయింది. యెంత వెదికినా కనిపించ లేదు. నౌకర్లనెంత దబాయించినా లాభం లేకపోయింది. వనజే తీసి వుంటుందని అమ్మ అనుమానం. 'కాదు, ఆ అమ్మాయి అలాంటిది కాదు' అని పైకి అన్నా లోలోన నాకూ అనుమానంగానే వుండింది. వనజనే అడిగి తెలుసుకుందామనుకున్నాను. కాని యెక్కడుంటుందో తెలీదు.

ఇంకేం చెయ్యాలో తోచలేదు. అప్పటికే మా పరీక్షలై పోయి నాయి. ఊరికి వెళ్ళిపోయిందేమో! ఏ వూరో తెలీదు. చేసేదేమీ లేక వూర్కుండిపోయాను.

## 3

సరిగ్గా వో నెల తర్వాత, వనజ దగ్గర్నించి ఉత్తరం వచ్చింది—

"రమా!

నీ వేలి వుంగరం పోయిందని బాధపడుతూ వుంటావు. నేనే దొంగిలించానని అనుమానపడుతూ వుంటావు కూడాను. అవును నిజమే. దాన్ని నేనే దొంగిలించాను....అది అందరి దృష్టిలో నేరమే కావచ్చు. కాని యే పరిస్థితుల్లో నేనా పని చేశానో తెలుసు కున్నాకే ఒక నిర్ణయానికి రమ్మని మనవి.

ఈ రోజుతో బియస్సీ పరీక్షలు పూర్తి అవుతాయి. అంటే వాసు పరీక్షలన్నమాట. ఇక ఫరవాలేదు, ఈ విషయం యిప్పుడు వాసుకు తెలిసినా ఫరవాలేదు. లేకపోతే పరీక్షలకు కూచోటం మాని వెయ్యటానిక్కూడా వెనుదీయడు. ఆ భయంతోనే ఇన్నాళ్ళూ ఓపిక పట్టి ఇప్పుడు రాస్తున్నాను.

కొన్నాళ్ళ క్రితం వాసుకి ధనసహాయం చెయ్యమని నేను నిన్ను అర్థించటమూ, నువ్వు నిర్మొహమాటంగా నిరాకరించటమూ

నీకు జ్ఞాపకం వుండి వుండాలి. ప్రపంచంలో ఇంకా ఉదార హృదయాలు లేకపోలేదు. యెలాగో అలాగ యిన్నాళ్ళు లాక్కొచ్చాము. కాని బియస్సీ ఫైనల్ పరీక్ష ఫీజు ఒక గడ్డు సమస్య అయి కూచుంది. యెంత ప్రయత్నించినా అంత డబ్బు పోగుచెయ్యలేకపొయ్యాను. ఆఖరికి నువ్వు జ్ఞాపకం వచ్చావు. నువ్వు మారివుంటావన్న నమ్మకం లేకపోయినా, యెంత బ్రతిమాలి అయినా నీ దగ్గరే సాధిద్దామన్న ఉద్దేశంతో ఆ రోజు మీ యింటికి వచ్చాను. కాని నువ్వు లేవు. యెంతసేపు కూచున్నా నువ్వు రాలేదు. డ్రెస్సింగ్ టేబిల్ మీద యేదో మాగజైన్ పడి ఉంటే, తీశాను. దానికింద నీ ఉంగరం కనిపించింది. చటుక్కున మెదళ్ళో మెరుపులాటి ఒక అయిడియా మెరిసింది. కాని ధైర్యమాగలేదు. చాలాసేపు నాలో నేనే మధనపడ్డాను. చివరికి యేదైతే అవుతుందన్న మొండి ధైర్యంతో వుంగరాన్ని వేలుకు తొడుక్కుని బైటికొచ్చేశాను.

నీ మేలు యెన్నటికీ మరిచిపోలేను. ఉంగరాన్ని అమ్మివెయ్యలేదు, కుదువపెట్టాను. ఏనాటికైనా దాన్ని విడిపించి తిరిగి నీకు అప్పగించే బాధ్యత నాది.

అయినా నేను చేసింది నేరమే. దానికి నువ్వు ఏ శిక్ష విధించినా నేను సిద్ధమే. ఆఖరికి పోలీసులకి అప్పగించాలనుకున్నా సిద్ధమే. తుది నిర్ణయం నీదే. ఉంటాను.

వనజ—"

ఆ ఉత్తరం నన్నెంతో కలవరపరచింది. ఆ అమ్మాయిని నేనెంత అపార్థం చేసుకున్నానో తలచుకుని బాధపడ్డాను. ఆ ఉత్తరం అమ్మ భయంకొద్దీ చించిపారేశాను.

ఇంతకూ ఆ ప్రబుద్ధుడు, వాసు, యెవరో యెలా వుంటాడో చూడాలని కుతూహలం కలిగింది. వాకబు చేశాను. కాలేజీలో స్నేహితురాళ్ళందరికీ అతను తెలుసు, కాని యెక్కడుంటాడో, యే వూరో యెవరికీ తెలీదు. అతని ఆచూకీ వనజకే రాసి కనుక్కుందామనుకుంటే, అప్పటికే ఆ ఉత్తరం చించేశాను. అడ్రసు కూడా నోటు చేసుకోలేదు.

# 4

శలవులై పోయాయి. కాలేజీ తెరిచారు. మొదటిరోజున వనజ రాలేదు. రెండోరోజు వచ్చింది. కాని నాకు చాలా దూరంగా కూచుంది. ఆ అమ్మాయివేపే చూస్తూ కూచున్నాను. కాని నా వేపుకు ఒక్కసారైనా కన్నెత్తి చూళ్ళేదు. ఇంటర్‌వెల్లో యెటు వెళ్ళిందో, లేడీస్ రూంలోకి రానేలేదు. ప్రయత్నపూర్వకంగా నన్ను తప్పించుకు తిరుగుతూన్నట్లు అనిపించింది. మధ్యాహ్నం వొక పీరియడ్ మాత్రమే వుంది. అది కాగానే గబగబా పుస్తకాలు సర్దుకుని బయటికి దారి తీసింది వనజ. నేనూ వెంటపడ్డాను. గేటుదాటి వెళ్లిపోతూంటే, "వనజా! ఆగు" అని కేకవేశాను.

చప్పున ఆగి వెనుతిరిగి నిలుచుంది. మొహం వెలవెలబోతోంది. అదుర్దాగా నా కళ్ళల్లోకి చూస్తోంది.

"ఏం నన్ను తప్పించుకు పారిపోతున్నావా?"

"నేనా?.... లేదే...."

"అయితే, పద."

"ఎక్కడికి?" మరీ అదుర్దాగా అడిగింది.

క్షణం ఆగి, "పోలీసుస్టేషన్‌కి" అన్నాను.

"ఆఁ?.... నిజంగా?" నిజంగానే వొణికిపోతోంది.

నాకు నవ్వొస్తోంది. అతి కష్టంమీద ఆపుకున్నాను.

"ఏఁ, భయపడుతున్నావా? అంత ధీమాగా రాశావుగా పోలీసులకి వప్పగించినా సిద్ధమేనని? అప్పుడే మరిచిపొయ్యావా?"

కొంతసేపు నిదానంగా, దీనంగా చూసి, "సరే, పద" అంది తలవంచుకుని.

రిక్షాను పిలిచి కూచోమన్నాను. కూచుంది. నేనూ కూచుని ఆబిడ్స్‌కు నడపమన్నాను.

దారిలో అడిగాను, "యెప్పుడొచ్చావ్ వూరి నించి?"

వనజ ఉలిక్కిపడి, ఆశ్చర్యంగా చూస్తో "నేనా?....వూరినించా?...." అంది.

"ఏం? వూరికి వెళ్ళనేలేదా?"

"లేదే!

"మరి ఆ ఉత్తరం?"

"ఓ—అదా....అదీ...." తడబడుతోంది.

"ఇక్కడనుంచే రాశావు. కాని దొంగ అడ్రసు యిచ్చావు" నేను బుకాయించాను. నిజంగా యెక్కడ అడ్రసు యిచ్చిందో, అసలు ఇచ్చిందో లేదో నేను గమనించనేలేదు.

"కాదు కాదు. అది దొంగ అడ్రసు కాదు. మా వూళ్లో నా కొక స్నేహితురాలుంది. ఆ పిల్ల అడ్రసు యిచ్చాను."

"ఏం, యిక్కడిది అడ్రసు ఇస్తే వెంటనే పోలీసులకి పట్టిస్తా ననుకున్నావా?"

వనజ మౌనంగా తల దించేసుకుంది. మళ్ళీ మాట్లాడలేదు.

తాజ్‌మహల్ హోటల్ దగ్గిర రిక్షా అపి, పంపించేశాను. నా కేసి ఆశ్చర్యంగా చూస్తోంది వనజ. మొహంలో కళ తిరిగి వచ్చింది. తిన్నగా ఫామిలీ గదిలోకి దారితీశాను. మారు మాట్లాడకుండా నన్ను వెంబడించింది. గదిలో మేమిద్దరం తప్ప మరెవ్వరూ లేరు. బాయ్‌కి అర్డరిచ్చి పంపించివేసి, వనజవైపుకు తిరిగాను. వనజ కళ్ళవెంట నీరు కారటం చూసి చకితురాలినై పోయాను. దిగ్గున నా చేతులు పట్టుకుని అనడం మొదలెట్టింది. "రమా! రమా! నన్ను క్షమించావు కదూ?....నేను చెయ్యరాని నేరం చేశాను. ఎంత క్షోభ పడుతున్నానో నువ్వు వూహించుకోలేవు. నీ దగ్గర్నించి జవాబు వస్తుందేమోనని వేయికళ్ళతో యెదురుచూశాను. కాని రాలేదు. నీ నిర్ణయం తెలీనేలేదు—చెప్పు రమా! ఇప్పటికైనా చెప్పు నన్ను క్షమించవా, లేదా? నువ్వు క్షమించకపోతే నేను బ్రతకలేను రమా!"

"సరే, అలాగే క్షమిస్తాను....కాని ఒక షరతు."

"షరతా?....ఏమిటది?"

"ఉన్నది వున్నట్టుగా అన్ని విషయాలూ చెప్పేసెయ్."

"ఇంకేం చెప్పనూ? అంతా ఆ ఉత్తరంలోనే రాసేగా?"

"అంతే నంటావా?"

"ముమ్మాటికీ అంతే. నేనేమి దాచడంలేదు. నన్ను నమ్మడం

లేదా?"

"అయితే—ఆ హీరో ఏడీ?"

"ఎవరు?—వాసా?"

"ఊఁ."

తల వంచుకుని, కొంతసేపు మౌనంగా కూచుని అంది, "ఏమో తెలీదు."

"అంటే?"

"పరీక్షలై పోయాయిగా?"

"తెలుసు. నువ్వన్నట్టు ఫస్టుకూడా వచ్చాడని తెలుసు. కాని, ఏడీ? యెక్కడున్నాడా పెద్ద మనిషి?....వొక్కసారి చూడాలని వుంది."

ఇంతలోకి బాయ్ వచ్చాడు, ఆర్డరిచ్చినవి తీసుకుని. వనజ మాట్లాడకుండా తింటూ కూచుంది.

"ఏం, నేనడిగింది వినపళ్ళేదా?"

"....ఏమో తెలీదన్నానుగా...పరీక్షలై పోయిన తర్వాత మేము కలుసుకోనేలేదు."

"ఇది నమ్మమంటావా?"

"నీ ఇష్టం. నిజమంతే."

"పోనీ, ఇది చెప్పు ...నీకేమవుతాడతను?"

"నాకా?....ఏమీకాడని ఇదివరకు కూడా ఒకసారి చెప్పినట్టున్నాను?...."

"ఏమో, జ్ఞాపకం లేదు. కాని ఏమీకాని వాని కోసం ఎందుకో అంత త్యాగం?"

"త్యాగమా? నేను చేసింది త్యాగం కాదే?"

"మరి?"

"ఇన్ని ప్రశ్నలెందుకు రమా? నన్ను క్షమించమన్నానుగా? నేను చేసింది నేరమేనని వొప్పుకున్నానుగా?...."

"సరే, నీ కిష్టం లేకపోతే చెప్పకు ...కాని, ఒక్క విషయం. ఆ ఉంగరం నాకు మా నాన్న ఇచ్చిన Birthday Presentation.

నేను దాన్ని పోగొట్టుకోలేను."

"తెచ్చిస్తాను. తప్పకుండా తెచ్చిస్తాను. అమ్మేయలేదు, కుదువపెట్టాను."

"అదే, ఎక్కడ? ఈ వూళ్లోనేనా?"

"అవును."

"ఎంతకు?"

"....వంద."

"సరే, రేపే వెళ్ళి విడిపించుకుందాం."

"రేపా?....కాని—కాని"

"నీ దగ్గిర డబ్బులేదు. నాకు తెలుసు....ఫరవాలేదు. నేనే విడిపిస్తాను. నాకది అర్జంటుగా కావాలి. వచ్చే వారంలోనే నా పుట్టిన రోజు."

వనజ మాట్లాడలేదు.

"ఏమంటావ్? రేపు వస్తావుగా నాతో?"

వనజ మెల్లగా తలూపుతూ అంది, "కాని....కాని నేనా డబ్బు తిరిగి ఇచ్చేస్తాను....కొంత గడువు కావాలి."

"సరేలే" అంటూ, బిల్లు డబ్బు చెల్లించి లేచాను.

రెండోరోజు వనజతో వెళ్ళి ఉంగరం విడిపించుకొచ్చాను. పెట్టెలోనే దొరికిందని అమ్మతో అబద్ధమాడాను.

ఆ సంఘటన తర్వాతకూడా వనజ ముభావంగానే వుంటూ వచ్చింది. మామధ్య దాదాపు మాటలే లేవు. తక్కినవారితోనూ అట్టే మాట్లాడేది కాదు. ఎప్పుడూ ఏదో చదువుతూనో ఆలోచిస్తూనో కనిపించేది. నా పుట్టినరోజుకి పిలిస్తేకూడా రాలేదు. నాకు ఆశ్చర్యం కలగలేదు. రానురాను ఆ అమ్మాయి గురించి అట్టే పట్టించుకోటం మానేశాను.

కాని వాసుని చూడాలన్న కోరికను మాత్రం చంపుకోలేక పోయాను. ఇతరత్రా వాకబుచేస్తే కాలేజీలో తిరిగి చేరలేదని తెలిపింది. కాలేజీ డే రోజున తప్పకుండా వస్తాడని ఆదుర్దాగా యెదురు చూశాను. కాని రాలేదు. అతని పేరు చదవటమూ, అతని గురించి

చాలా చాలా పొగుడ్తూ ప్రిన్సిపాల్ మాట్లాడటమూ జరిగింది. కాని అతను మాత్రం కనిపించలేదు.

## 5

మరో మూడు నెలలు గడిచాక, ఒక ఆదివారం రోజున, ఏదో నవల చదువుతూ గదిలో పడుకుని వున్నాను. కాల్ బెల్ మ్రోగింది. ఇంట్లో ఎవ్వరూ లేదు నేనుతప్ప. తమ్ముడు రాంబాబును తీసుకు రావటానికి పబ్లిక్ స్కూల్‌కెళ్ళారు అమ్మా నాన్న.

వెళ్ళి తలుపు తీశాను. ఎదుటో వ్యక్తి. అతణ్ని చూడగానే, ఎందుకోగాని పాత పరిచయస్తుణ్ణి అకస్మాత్తుగా కలుసుకున్న అను భూతి పొందాను. కాని అతాణ్ని ఎక్కడా, ఎప్పుడూ 'చూసినట్లు మాత్రం జ్ఞాపకం లేదు. తేరిపార చూశాను. చెప్పుకోదగ్గ అందం లేదు. కాని ఆ కళ్లల్లో ఏదో తేజస్సు, తీపి. వాటివల్లేనేమో మొహానికి ఓ హుందాతనం చేకూరింది. అలానే అతని కళ్లల్లోకి చూస్తూ వుండి పోయాను.

"మీరు....మీరు, రమగారు కదూ?" అంటున్నాడు.

అవునన్నట్లు తలూపాను. నోట మాటరాలేదు.

"నేను....నా పేరు వాసు...."

"ఓ...." అప్రయత్నంగా అన్నాను. అందుకేనేమో ఆ అనుభూతి!

"రండి" అంటూ, లోపలికి దారితీశాను. బెరుకు బెరుకుగా వొచ్చి డ్రాయింగ్ రూంలో కూచున్నాడు. నేనూ ఎదురుగా కూచు న్నాను" కంగ్రాచ్యులేషన్స్!" అన్నాను.

"దేనికి?"

"మీరు యూనివర్సిటీ ఫస్టు వచ్చారుగా?"

"ఓ, అదా....అందుకే మీ దగ్గరికొచ్చాను."

"అంటే?" నాకేమీ బోధపళ్ళేదు.

"ఆ ఫస్టు ఎలా రాగలిగానో చెబుదామని."

"ఉండండి, టీ పట్టుకొస్తాను" అని లేచాను.

"వొద్దొద్దు."

"ఏం?"

"నాకు అలవాటు లేదు"

"నిజంగానా?"

"మీతో అబద్ధమాడటం దేనికి?"

మారు మాట్లాడలేక మళ్ళీ కూచున్నాను.

కొద్ది క్షణాలు మౌనంగా తల వంచుకుని, ఏదో తీవ్రంగా ఆలోచిస్తూన్నట్టు కూచున్నాడు. ఎలా మొదలుపెట్టాలో తెలియక తికమక పడుతూన్నట్టుంది. పోనీ, నేనే ఓ మాట అందిద్దామనుకుంటూంటే నే అందుకున్నాడు.

"చూడండి రమగారూ! వనజ నా కంతా చెప్పేసింది."

"వనజా?....ఏ విషయం?"

"మీ గురించీ, నా గురించీ"

"అంటే?"

"నాకోసం ఆర్థిక సహాయం అర్థించటానికి మీ దగ్గరికొచ్చినట్టూ, మీరు నిరాకరించినట్టూ, ఆ తర్వాత నా పరీక్ష ఫీజు కట్టడానికి గాను, మళ్ళీ మీ సహాయాన్ని కోరటానికి మీ దగ్గరికొచ్చినట్టూ, మీరు లేకుంటే మీ గదిలో మీకోసం చాలాసేపు కూచున్నట్టూ, చివరికి మీ ఉంగరాన్ని దొంగిలించి, దాన్ని తాకట్టుపెట్టి నా ఫీజు కట్టినట్టూ, ఆ తర్వాత నా పరీక్షలయ్యాక మీకు ఉత్తరంలో అంతా తెలియజేసినట్టూ, కాలేజీ తెరిచాక మిమ్మల్ని కలుసుకుని క్షమించమని వేడుకున్నట్టూ, తాను ఉంగరాన్ని విడిపించలేకపోతే మీరే విడిపించుకున్నట్టూ అంతా, అంతా చెప్పేసింది."

నేను మాట్లాడలేదు.

మళ్ళీ మొదలెట్టాడు, "వనజ చేసింది నేరమే, గొప్ప నేరం. కాని మీరు క్షమించారట. అది మీ ఉదారహృదయానికి నిదర్శనం. కాని నిజానికి నేరస్తురాలు వనజకాదు, నేను. నేనండీ నిజమైన నేరస్తుణ్ణి...."

అప్పటికీ నేనేం మాట్లాడలేదు.

"ఇంతవరకూ నాకేం తెలీదు. ఇంత జరుగుతూన్నా వనజ

నాతో ఒక్కమాటా చెప్పలేదు. ఇప్పుడిప్పుడే తెలిసింది. వెంటనే మీ దగ్గరికి పరుగెత్తుకొచ్చాను."

"దేనికి?"

"నన్ను క్షమించమని ప్రాధేయపడటానికి మాత్రం కాదు. వనజ చేసిన నేరం క్షమార్హమని మీరు భావించి వుంటారు. అందుకే క్షమించారు. కాని నా నేరం క్షమింపరానిది; తప్పకుండా శిక్షపడాలి. ఆ శిక్షేదో మీరే విధించాలి. అది కోరటానికే వచ్చాను."

నాకు నవ్వాగలేదు. నవ్వేశాను.

వాసు బాధగా చూస్తూ అన్నాడు, "మీకు వేళాకోళంగా వుండొచ్చు. కాని నేను సీరియస్‌గా అంటున్నాను."

"సారీ, నా ఉద్దేశం అది కాదు. కాని మీరెందుకింత బాధపడుతున్నారో నా కర్థంకావటం లేదు."

"కాదు, నా గురించి మీకేం తెలిదు కాబట్టి అర్థంకాదు."

"పోనీ, మీరే చెప్పండి మీ గురించి...."

"అది అనవసరం. నాకు కావలసింది శిక్ష. మీరు విధించాలి."

"సరే, అలాగే విధిలిస్తాలెండి."

"చెప్పండి"

"ఇప్పుడేనా?....తీర్పు తీరిగ్గా చెప్పాలి."

"సరే, మీ ఇష్టం. మీరే శిక్ష విధించినా, ఎప్పుడు విధించినా అనుభవించటానికి సిద్ధంగా వుంటాను. కాని నా నిర్ణయాన్నిమాత్రం ఇప్పుడే అమల్లో పెట్టనివ్వండి."

"ఏంవిటి?"

"ఇదిగో ఇది" అంటూ చేతిలోని ఒక కాగితం చుట్ట బల్ల మీద పెట్టాడు. అంతసేపూ అది అతని చేతిలో వున్నట్టు గమనించ లేదు.

"ఏంవిటది?"

"నేను ఫస్టు వచ్చానన్నారే దాని బాపతు డిగ్రీ"

తీసి చూశాను, అదే.

"నేనేం చెయ్యను?"

"చించి పారేసెయ్యండి."

"ఆఁ!" నాకు షాక్ తగిలినట్టయింది.

"అవును, ఆ దొంగ సొమ్ముతో సంపాదించిన డిగ్రీ నా కక్కర్లేదు. అది నే నెన్నడూ వాడుకోను."

నాకు నోట మాట రాలేదు. ఆశ్చర్యంతో అతనికేసి చూస్తూ కూచుండిపోయాను. నేను తేరుకునే లోగానే, 'శలవు' అంటూ లేచి గదిలోంచి వెళ్ళిపోయాడు.

"వాసుగారూ! — వాసుగారూ! ఆగండి. ఒక్కమాట—" అంటూ వెంబడించాను. కాని అతను ఆగలేదు. తిరిగైనా చూళ్లేదు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ వెళ్ళిపోయాడు. నేను గుమ్మంలో నిశ్చేష్టగా నిలుచుండిపోయాను. నా చేతిలో ఆ డిగ్రీ అలాగే వుండిపోయింది.

అలా ఎంతసేపు నిలుచుండిపోయానో, కారు హారన్ విని పించేదాకా స్పృహే లేదు. అమ్మా, నాన్నా, తమ్ముడూ కారు దిగి వస్తూండటం చూసి, గబగబా నా గదిలోకి వెళ్ళిపోయి, ఆ డిగ్రీ పత్రాన్ని నా సూటుకేసులో దాచేసి కిందికి దిగి వచ్చేసరికి తమ్ముడు పరుగెత్తుకుంటూ వచ్చి నన్ను చుట్టేసుకున్నాడు. వాడు వారానికొక సారి ఇంటికొస్తాడు. ఆ క్రితం వారంలో తన స్కూల్లో జరిగిన విశేషాలూ, వాడు చేసిన ఘనకార్యాలూ ఏకరువు పెడుతున్నాడు. నా మొహానికి చిరునవ్వు పులుముకుని 'ఊఁ, ఆఁ' అంటూనే వున్నాను. కాని ఒక్కటీ నా బుర్రకెక్కటంలేదు. ఆఖరికి నా పరధ్యానాన్ని గమనించి, విసుగెత్తి వెళ్ళి అమ్మా నాన్నతో ఫిర్యాదు కూడా చేశాడు, "అక్కయ్య నా మాటలు వింటంలేదని". నేను ముభావంగా వుంటం వాళ్లు కూడా గమనించినట్టున్నారు. "అదేవిటే, అలా వున్నావు! వొంట్లో బాగాలేదా!" అని అడిగింది అమ్మ. "అబ్బే, ఏంలేదే" అనేశాను. కాని ఎంత ప్రయత్నం చేసినా ఆ సంఘటన మరుపుకు రాకుండా వుంది. వాసు పదేపదే జ్ఞాపకమొస్తున్నాడు.

సాయంత్రం మామూలు ప్రకారం సినిమా కెళ్దామని మారాం చేశాడు రాంబాబు. అలా ప్రతివారం నేనూ, వాడూ కలిసి సినిమా

కెళ్ళడం అలవాటు. ఆ రోజు మాత్రం వెళ్ళాలని లేదు. కాని ఎలాగూ వాడు వదలడనీ, లేనిపోని సంజాయిషీలు ఇచ్చుకోవాలనీ, సినిమా చూస్తే మనసు కాస్త తేలికపడొచ్చుననీ బయలుదేరాను. వాడే పురమాయించిన సినిమాకెళ్ళాము. సినిమా చూస్తూన్నాననేగాని అది ఏవిఁటో ఏమో అంతుపట్టలేదు. తిరిగొచ్చాక ఆ సినిమా గురించి తమ్ముడు తెగ వాగుతోంటే, నేను ఒక్కమాటా మాట్లాడలేదు. భోజనం కూడా సరిగ్గా సహించలేదు. అది గమనించిన నాన్న ఒకటి రెండు సార్లు నాకేసి వింతగా చూసి, ఏదో అడగబోయి మాను కున్నారు. అమ్మమాత్రం అడిగింది, "ఏం, లేదు, కాస్త తలనొప్పిగా వుంది" అని బొంకి, లేచి, చేతులు కడిగేసుకుని గదిలోకెళ్ళి గడియ వేసుకుని పడుకున్నాను.

చీకట్లో మళ్ళీ ప్రత్యక్షం వాసు గంభీరవదనం! అవేకళ్ళు, అవే చూపులు. సూటిగా గుండెల్లోకి దూసుకుపోయే చూపులు. మనసంతా కలవరం చెందుతోంది. 'అలాంటి వింత మనుషులుకూడా ప్రపంచంలో వుంటారా?' అన్న ఆశ్చర్యంలోంచి తేరుకోలేకపోతున్నాను. కాని.. నేను....నేనేం చెయ్యాలో తోచడంలేదు....చప్పున వనజ జ్ఞాపక మొచ్చింది. అవును, వనజే దీనికి దారి. వనజ ద్వారానే అతణ్ని పట్టుకోవాలి. ఎలాగో అలాగా అతని డిగ్రీ అతని కిచ్చేస్తే నా బాధ్యత తీరిపోతుంది. ఆ నిశ్చయంతో నా మనసు కుదుటపడ్డట్టే అనిపించింది. కాని వెంటనే ఆలోచనలు వనజమీదికి వెళ్ళాయి. అసలు వనజ ఎవరో ఏమో తెలీదు. ఆమెకూ, వాసుకూ సంబంధమేఁవిటో అంతకన్నా తెలీదు. అంతులేని ఆలోచన్లతో ఆ రాత్రి శివరాత్రే అయింది.

## 6

రెండో రోజు పెందరాళే వెళ్ళాను కాలేజీకి. వనజ కోసం ఎదురు చూస్తూ కూచున్నాను. కాలేజీ మొదలయ్యేదాకా రానేలేదు వనజ. మొదటి పీరియడ్ మధ్యలో వొచ్చింది. పీరియడ్ కాగానే వెళ్ళి పట్టు కున్నాను.

"రా, నీతో అర్జంటు పని వుంది" అంటూ బయటికి లాక్కె ళ్ళాను. మారు పలక్కుండా నన్ను అనుసరించింది. లేడీస్ రూంలో

కె్తే అక్కడ మరో ఇద్దరు ముగ్గురు అమ్మాయిలు కనిపించారు. బయట పార్కులోకి దారితీశాను. అక్కడెవ్వరూ లేరు. లాన్‌మీద చతికిలబడి వనజనుకూడా లాగి కూచోబెట్టాను. కుడి మోకాలు మీద గడ్డం ఆన్చి మౌనంగా కూచుంది వనజ. అప్పుడు గమనించాను ఆ అమ్మాయి కళ్ళు వాచి వున్నాయనీ, రాత్రి బాగా ఏడ్చినట్టుందనీ. కారణం అడగాలని నోటిదాకా వచ్చింది, కాని అడగలేదు.

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచాక "ఇదిగో, ఇటుచూడు" అన్నాను వాసు డిగ్రీ సర్టిఫికేట్ చూపిస్తూ.

వనజ ఓరగా చూపి కళ్ళు తిప్పేసుకుంది. డిగ్రీ తీసుకోలేదు.

"ఏం, చూడవా?"

"అక్కర్లేదు.... తెలుసు."

తెలుసా?....అయితే అప్పుడే అంతా చెప్పేశాడన్నమాట, వాళ్ళ మధ్య దాపరికాలు లేవన్నమాట; వాళ్ళు అంత సన్నిహితులన్న మాట! ఎందుకో ఆ తలంపు రాగానే నా మనస్సు కలక్కుమంది. ఎన్నడూ లేంది వనజను చూస్తే ఈర్ష్యలాంటిది పొడసూపింది....

"సరే, అయితే తీసుకో" అన్నాను కాస్త కటువుగానే.

"నేనా?"

"అవును, నువ్వే. మరి నేనేం చేసుకోనూ?"

"ఆ మాట అతణ్నే అడక్కపోయావా?"

"అడిగాను."

"ఏమన్నాడు?"

"చించి పారెయ్యమన్నాడు."

"అదే పని చెయ్యి."

ఏఁవిటీ వింత మనిషి! వాసుకు డిగ్రీ ఇప్పించాలని ఆనాడు అంత తాపత్రయపడ్డ ఈ మనిషి ఈ నాడు యెంత చల్లగా అంటోంది చించిపారెయ్యమని! నా ఆశ్చర్యానికి అంతులేదు. ఏమనాలో తోచ లేదు. ఆ డిగ్రీ అక్కడే పారేసి చక్కా వెళ్ళిపోదామన్నంత ఉక్రోషం వచ్చింది. కాని ఆఖరి ప్రయత్నం చేద్దామని "పోనీ, పద వాసు యెక్కడుంటాడో చూపించు, నేనే ఇచ్చేస్తాను" అన్నాను.

వనజ తలెత్తి నా కేసి వింతగా, భయంభయంగా చూస్తూ వుండిపోయింది. ఒక్కసారి కళ్ళలోంచి బొటబొటా కన్నీరు కారటం మొదలెట్టింది. నేను చకితురాలనయ్యాను.

"ఏంవిటి వనజా! ఏమైంది? ఎందుకేడుస్తున్నావ్?" అని తేదుర్దాగా అడిగాను.

వనజ కొంగుతో కళ్ళు తుడుచుకుని మొహం తిప్పేసుకుంది. మాట్లాడలేదు. నేను వనజ చుబుకం పట్టుకుని ఇటు తిప్పి మళ్ళీ అడిగాను "చెప్పు వనజా! చెప్పు. నీ స్నేహితురాలిగా, అడుగుతున్నాను చెప్పు...."

కొద్దిక్షణాలు ఆగి అంది, "చెబుతాను అంతా చెబుతాను.... నా కథంతా చెప్పేస్తాను."

నాకు పట్టరాని ఆనందం కలిగింది. వనజ చేతులు పట్టుకుని వూపుతూ "చెప్పు, చెప్పు" అని తొందరచేశాను.

వనజ చేతులు విడిపించుకుని, మెల్లిగా అంది, "చెబుతానన్నానుగా, తప్పకుండా చెబుతాను....కాని యిప్పుడు కాదు. మరోసారి...."

నా ఉత్సాహమంతా చల్లారిపోయింది. "లేదు, లేదు. ఇప్పుడే చెప్పాలి" అంటూ పట్టుబట్టాను. "లేకపోతే పద. మా యింటికి పోదాం. లేదా మరెక్కడికైనా వెడదాం" అన్నాను.

"ఒద్దు, వొద్దు రమా! నే నిప్పుడు యెక్కడికీ రాను. నువ్వు క్లాసుకెళ్ళు."

"మరి నువ్వో?"

"ఆనక వస్తాను. కాసేపు నన్నిలా వొంటిరిగా వుండనీ. నా మనసు బావోలేదు."

ఏం చెయ్యాలో తెలియలేదు. తనకై తానే చెబుతానన్నది, అంతే చాలు. మరీ బలవంతం చేస్తే మళ్ళీ మొండికేస్తుందేమోనని పించింది. "సరే, అయితే అంతా చెబుతానని మాటివ్వు" అంటూ చెయ్యి చాచాను. వనజ మాట్లాడకుండా చేతిలో చెయ్యివేసింది. నేను లేచి తిన్నగా క్లాసుకి వెళ్ళిపోయాను.

వనజ వస్తుందేమోనని యెదురుచూశాను. ఎంతకూ రాలేదు. మరో పీరియడ్ అయినా రాలేదు. వెళ్ళి చూస్తే పార్కులోగాని, లేడీస్ రూంలోగాని యెక్కడా కనిపించలేరు. పుస్తకాలు డెస్కు మీదే వుండిపోయాయి. నేనే వాటిని ఇంటికి తీసికెళ్ళిపోయాను.

రెండోరోజు, మూడోరోజు, నాలుగో రోజు కూడా వనజ జాడలేదు. నా ఆదుర్దా రోజురోజుకూ హెచ్చుతోంది. కాని యెటూ పాలుపోక హతాశురాలినై పోతున్నాను.

7

అయిదోరోజు కాలేజీలో నా క్లాస్‌మేట్ లీల కేకవేసింది, "ఏయ్ రమా! మాట" అంటూ!

దగ్గర కెళ్ళాను. లీల తగ్గుస్వరంలో అంది, "ఇదెప్పటి నించీ?" అని. నా కేమీ అర్థం కాలేదు.

"ఏఁవిటెప్పట్నించీ?"

"ఇదే, ఈ ప్రేమ కలాపాలు."

నాకు ఆశ్చర్యం, ఉక్రోషం కలిగాయి. "ప్రేమకలాపాలా? ఏఁవిటే నువ్వు వాగేదీ?" అన్నాను.

"నేను కాదే వాగేదీ, ఇదుగో ఈ ప్రేమలేఖ" చేతిలో కవరు చూపించింది. నాకు మరీ ఆశ్చర్యం వేసింది.

"ప్రేమలేఖా?... నాకా?....ఏదీ, ఇలాతే."

"ఊహుఁ, ముందు చెప్పు నీ హీరో యెవరో."

నాకు నవ్వొచ్చింది. అది ప్రేమలేఖ కాదని నా గట్టి నమ్మకం. దాన్ని ఉడికించాలని అన్నాను, "అది నిజంగానే ప్రేమలేఖ అయితే ఒక్కరే రాసివుంటారు."

"ఎవరు?"

"ఇంకెవరు? రమేశ్" అని కిలకిలా నవ్వాను.

లీల మొహం ఎర్రబారింది. "ఏఁవిటే ఏం వాగుతున్నావ్?"

"మరి నాకు తెలిసినంతమట్టుకు మన కాలేజీలో లవ్ లెటర్స్ రాసే హీరో అతనొక్కడే."

"నీకు రాస్తాడా?" అందులో కొంత అనుమానం కూడా

మిళితమైవుంది.

"ఏం, నీ కొక్క_ర్తెకే రాయాలా?"

"హుం, రాస్తాడు, రాస్తాడు. బుర్ర రామకీర్తన పాడిస్తే" అంటోంది ఉక్రోషంతో.

"అలాగే చేద్దువుగాని, ఆడిటివ్వు."

"ఉహుం, నేనే చించి చూస్తాను" అంటూ చించింది. "అబ్బో! మహాభారతంలాగుందే .... ఇట్లు నీ వనజ....వనజా? వనజెవరే?"

వనజ రాసిన ఉత్తరం అనగానే నాకు ఎక్కడలేని సంతోషం పుట్టుకొచ్చింది. "వనజ రాసిందా?—వనజాక్షి, మన క్లాసులో లేదూ....?"

"ఓ, ఆ ముచ్చుపిల్లా? దాంతో నీ కెప్పటినించి స్నేహం?"

"అదంతా యెందుగ్గానీ, నీ ప్రియుడు రాసింది కాదని తేల్చు కున్నావుగా, అది ఇలా యిచ్చి వెళ్ళు."

"హుం, తీసుకో. ఆ వెధవ వుత్తరం నువ్వు చదవమన్నా చదవను" అంటూ వెళ్ళిపోయింది.

ఉత్తరం తీసి చూశాను. లీల అన్నట్లు భారతంలాగే అయి దారు పేజీలుంది. ఉత్తరాన్ని నోట్ బుక్ లో దాచుకుని, ఇంటికెళ్ళి నా గదిలో గడియ వేసుకుని తీరిగ్గా చదవనారంభించాను:

"రమా!

ఇన్నాళ్ళూ నేనేమైపోయానోననీ, యెక్కడికి వెళ్ళిపోయానో ననీ ఆలోచిస్తూ వుండివుంటావు కదూ? నేనేమీ అయిపోలేదు. ఇక్కడే వున్నాను. కాని యిక వుండను. వెళ్ళిపోతున్నాను. వెళ్ళి పోయే ముందు నీకు చేసిన వాగ్దానం ప్రకారం నీకో పెద్ద ఉత్తరం రాసి నా కథంతా చెప్పేద్దామనుకున్నాను. నా గోడంతా అలా వెళ్ళ బుచ్చుకుంటే కాస్తయినా మనశ్శాంతి కలుగుతుందేమోననుకున్నాను. కానీ క్షమించు. అలా చెయ్యలేకపోతున్నాను. ఇన్నాళ్ళూ మనసులో తర్కించుకున్నాకే ఈ నిర్ణయాని కొచ్చాను. నా జీవిత రహస్యాలు నాలోనే వుండాలి, నాతోనే అంతమవాలి.

అయితే వాగ్దానభంగం చేస్తున్నాననుకోకు. ముక్తసరిగా మూడుముక్కల్లో చెప్పేస్తాను. నేను చెప్పేదానితో తృప్తిపడి తక్కిన దానికోసం ఆరా తీద్దామన్న వృథాప్రయాస పడొద్దని ప్రార్థన.

నేనెవరైతేనేం, ప్రస్తుతానికి అనాథను. వెనక అంధకారం, ముందు అగాధం. ఏమైపోతానో తెలీదు.

వాసుకూ నాకూ ఏ సంబంధమూ లేదని నీతో చెప్పాను. అది అక్షరాలా నిజం. కాని వాసు యెవరో కాదు, నాకు స్వయాని మేనబావ. ఒకే ఇంట్లో పుట్టి పెరిగాం. వాసు చిన్నప్పుడే వాళ్ళనాన్న చనిపోయాడు. అత్తయ్యా, వాసూ మా ఇంట్లోనే వుండేవాళ్ళు. నాకు తెలిసొచ్చినప్పటి నించీ ఇంట్లో అందరి నోటా వింటూండే దాన్ని వాసు నాకు భర్త అవుతాడని. నేనూ పూర్తిగా నమ్మాను. మరోలా అవుతుందని కలలో కూడా అనుకోలేదు. కాని నా దుర దృష్టంకొద్దీ, వాసుకు నేనంటే గిట్టేది కాదు. పెద్దయ్యాక నన్ను పెళ్లి చేసుకోనని మొండికేసుకున్నాడు. మా అత్తయ్య యెంత మొత్తుకున్నా వినలేదు. ఉక్రోషంకొద్దీ మా అమ్మ, నేను యెంత ఏడ్చినా వినకుండా నన్ను మరొకడికి బలవంతాన అంటగట్టింది. అత్తవారింట్లో వుండకుండా పారిపోయి వస్తూవుండేదాన్ని, నన్ను కొట్టేవారు, తిట్టేవారు. అయినా భీష్మించుకూర్చునేదాన్ని. నా జీవితం బుగ్గయిందని మా అత్తయ్య అమిత బాధపడేది. చివరికి ఆమె కన్ను మూసింది. వాసు కూడా పట్నం వెళ్ళొచ్చేశాడు. వాసు లేకుండా నేనా ఇంట్లో వుండటం దుర్భరమైపోయింది. ఒకరోజు యెవరికీ చెప్పాపెట్టకుండా వాసును వెతుక్కుంటూ పట్నం చేరుకున్నాను. వాసు నన్ను తరిమివెయ్యటానికి యెంత ప్రయత్నం చేసినా విన కుండా అతని గదిలోనే తిష్టవేశాను. నన్ను లాక్కెళ్ళటానికి మా అత్తగారి తరఫువారు నానా రభస చేశారు. వాసు నిర్లిప్తంగా వుండే వాడు. నేనే మొండిగా యెదిరించేదాన్ని. ఒకసారి నా మెళ్ళోని మంగళసూత్రాన్ని తెంచి కట్టినవాడి మొహాన విసిరికొట్టాను. ఆఖరికి విసిగి వేసారి వాళ్ళూ వూరుకున్నారు. మా అమ్మా, నాన్న వాళ్లు నా

మొహమే చూడనన్నారు. వాసు తప్ప నాకు మరో దిక్కులేకుండా పోయింది. నా కదే చాలని సంతోషించాను. కాని వాసు మాత్రం నన్ను వదిలించుకోటానికి ప్రయత్నాలు చేస్తూనే వున్నాడు. పోనీ, నాకు చదువు చెప్పి ఓ దారి చూపించమని ప్రాధేయపడ్డాను. ఒప్పుకున్నాడు. మెట్రికులేషనుకి కట్టి పాసు చేయించాడు. ఆ తర్వాత వాసు యెంత వొద్దన్నా వినక కాలేజీలో చేరాను.

వాసు ట్యూషన్లమీద వచ్చే నాలుగురాళ్లు ఏ కొశానా సరిపొయ్యేవి కావు. అందుకే అప్పుడప్పుడు మీలాంటి గొప్పింటివాళ్ళ దగ్గర భిక్షాటనకు బయలుదేరేదాన్ని. చదువులో పేరు ప్రతిష్ఠలు ఇట్టే కొట్టేస్తున్న వాసు పేరిట ఉదారంగానే లభించేవి విరాళాలు. అయితే ఒకొక్కసారి అవీ స్థంభించిపొయ్యేవి. వాసు మహా ఆత్మాభిమాని. నాలుగురోజులు పస్తు అయినా వుంటాడుగాని ఒకరి ముందు దేహీ అని చెయ్యి చాచడు. నన్నూ అడిగేవాడు కాడు. అతని అన్ని అవసరాలూ నేనే గ్రహించి సర్దుబాటు చేసేదాన్ని. ఆ అవసరాల్లో ఒక దురలవాటు కూడా వుంది-సిగరెట్టు తాగటం. విపరీతంగా కాలుస్తాడు. ఎప్పుడూ ఏదో చదువుతూనో, రాస్తూనో, ఆలోచిస్తూనో వుంటాడు. అప్పుడు అతని చేతివేళ్ళు సిగరెట్టుకోసం అప్రయత్నంగా తడుముతూంటాయి. అది దొరకనప్పుడు అతని మొహంలో బాధ వర్ణనాతీతం. ఆ బాధ నేను చూళ్ళేను. అందుకే అతని అందుబాటులో సిగరెట్లూ, అగ్గిపెట్టె వుండేట్లు చూసే బాధ్యత నా మీద వేసుకున్నాను. వాసుకే నా జీవితాన్ని అంకితం చేసిన నేను అతనికోసం, అతని ఉజ్వల భవిష్యత్తుకోసం ఏం చేసినా తప్పుగా భావించేదాన్ని కాదు. అలాంటివి కొన్ని చేశాను కూడాను, సీతోనూ, మరెవ్వరితోనూ, చెప్పకూడని పనులు. అవి నాకూ భగవంతుడికి మధ్యే వుండి పోవాలి.

వాసు నా వాడు. అతని కరడుకట్టిన హృదయం ఏనాటికైనా కాస్తన్నా కరగకమానదు. నాకు అందులో చోటు దొరక్కపోదు. వాసు చివరికి నా వాడే అవుతాడు అన్న ఆశాకిరణం వెలుగులోనే జీవిస్తూ వచ్చాను ఇన్నాళ్ళూ. కాని కొన్నాళ్ల క్రితమే, అకస్మాత్తుగా

గ్రహించగలిగాను, వాసు హృదయానికి కూడా స్పందనశక్తి వుందనీ, ప్రేమానురాగాలకు తావు ఉందనీ. అయితే అతని హృదయ ఫలకంమీద నాకు బదులు మరో ప్రతిమ చిత్రింపబడుతూ వుందని. దాంతో నా ఆశలన్నీ పటాపంచలై పోయిన్నై. నా అంతానికి అదే నాందిగా తోచింది. అయినా అది నిజంకాదేమో, కేవలం నా అపోహే నేమో అన్న భ్రమలో గడిపాను యిన్నాళ్లు. కాని, మొన్న, నాలుగ రోజుల క్రితం అదీ పారిపోయింది. ఇక సందేహంలేదు. నాకిక్కడ తావులేదు. వాసు జీవితంలోంచి శాశ్వతంగా తొలగిపొయ్యే సమయం ఆసన్నమైంది. అందుకే ఈ నిర్ణయం.

రమా! వాసు హృదయంలో గూడుకట్టుకున్నది యెవరో నువ్వు వూహించగలవా?....మరెవ్వరో కాదు, నువ్వే. అవును, రమా! ఇది అక్షరాలా నిజం. ఇది యెలా సాధ్యమని విస్తుపోతు న్నావా? మొన్నటిదాకా నువ్వు వాసును చూడని మాట నిజమే. కాని వాసు మాత్రం నిన్ను చానాళ్ల బట్టి యెరుగును. బహుశ నువ్వు కాలేజీలో చేరినప్పటి నించీ యెరుగును. వాసుకు మేధావులంటే తగని గౌరవం. అందులోనూ ఆడపిల్లలు స్టేటుకంతకూ ఫస్టు రావటం చాలా అరుదు. బహుశ మొట్టమొదటి గోఖలే స్కాలర్ అమ్మాయివి నువ్వే అనుకుంటాను. వాసుకు నీ మీద గురి కుదర టానికి మొదటి కారణం అదే అయివుంటుంది. అయినా అతనిలోని సహజమైన అభిమానంకొద్దీ నిన్నెప్పుడూ కలుసుకోటానికి ప్రయ త్నించి వుండడు. అందులోనూ ఆడపిల్లలకు దూరదూరంగా ఉండే గుణం. అప్పుడప్పుడు కొందరు పిల్లలొచ్చి పలకరించినా ముఖావంగా ముక్తసరిగా జవాబులిచ్చి వదిలించుకునేవాడు. నువ్వైతే అసలు యెప్పుడూ రాలేదు, మాట్లాడలేదు. నీ మీద గౌరవం, ప్రేమా పెరగ టానికి ఇదే రెండో కారణం కావచ్చు. ఏది ఏమైనా నువ్వే వాసు హృదయరాణివి. సందేహంలేదు. నాతో యెప్పుడూ చదువు గురించి తప్ప మరో విషయం మాట్లాడని వాసు కొన్నాళ్ళ క్రితం అకస్మా త్తుగా నీ గురించి, మొదట చూచాయగానూ, తర్వాత తరచి తరచి అడగటం మొదలెట్టేసరికి నాకు ఆశ్చర్యమూ, అనుమానమూ కలి

గాయి. వాసు నా చేయి జారిపోతున్నాడేమోనన్న భయం కూడా బయలుదేరింది. అలా జారిపోకుండా దక్కించుకుందామన్న వుద్దేశం తోనూ, తనకోసం నేనెంత త్యాగం చేస్తున్నానో చెప్పుకుని అతని కృతజ్ఞతా, సానుభూతి సంపాదించాలన్న ఆశకొద్దీ నీ ఉంగరం సంగతి కూడా చెప్పేశాను. కాని దాని ఫలితం పూర్తిగా భిన్నంగా పరిణమించింది. నా మీద వాసుకు జుగుప్స మరీ పెరిగింది. బాగా చీవాట్లు పెట్టాడు. వెంటనే రెండోరోజే నీ దగ్గరికెళ్లొచ్చాడు. ఆ తర్వాత ఇంకా చీవాట్లు వేశాడు. నేను గనక వెళ్లిపోకపోతే తానే వెళ్లిపోతానని బెదిరించాడు కూడాను. ఇక నా కిక్కడ నిలవ నీడ లేదు. వెళ్లిపోతున్నాను. వాసు అన్నాడని కాదు, చీవాట్లు వేశాడనీ కాదు. ఇహ అతని హృదయంలో నేను యెన్నటికీ స్థానం సంపాదించుకోలేనని నిర్ధారణ అయిపోయింది. అందుకే తొలగి పోతున్నాను.

రమా! నువ్వంటే నాకు ఈర్ష్యాలేదు, కోపమూలేదు. ఒక విధంగా నాకు సంతోషంగానూ, సంతృప్తిగానూ వుంది. నా తాపత్రయమంతా ఒక్కటే, వాసు గురించి. అతను చల్లగా బ్రతకాలనీ పైకి, పైపైకి పోవాలనీ నా ఆకాంక్ష. దానికి దోహదపడే భాగ్యం నాకు దక్కలేదు. ఇహ వాసును నీ చేతుల్లో పెడుతున్నాను. నీ మీద నాకు పూర్తి నమ్మకముంది. అందుకే తృప్తిగా వెళ్లిపోతున్నాను.

క్షమించు రమా! వాసు నిన్ను ప్రేమిస్తున్నాడని తెలయగానే నువ్వూ అతణ్ని ప్రేమించితీరుతావన్న ధీమాతో రాస్తూన్నట్టున్నాను కదూ? అవును, రమా! నా నమ్మకం అదే. వాసును ఎవరూ ప్రేమించకుండా వుండలేరు. అయినా నువ్వు వ్యక్తిత్వంగల మనిషివి. ఒకర్ని ప్రేమించమని ఆజ్ఞాపించే అధికారం మరెవరికీ లేదు. కాని రమా! ఒక్కమాట. వాసును నేను బాగా ఎరుగుదును. శతమొండి; అతని మనసు దేనిపైనన్నా లగ్నమైతే దాన్ని సాధించేదాకా వదలడు. సాధించలేకపోతే ఆ ప్రయత్నంతో హతమైపోతాడేగాని మరో దిక్కుకు దృష్టి మరల్చడు. ఈ ఒక్క విషయం దృష్టిలో పెట్టుకుని ఒక నిర్ణయానికి రా.

వాసు ఎక్కడుంటాడో ఇంతవరకు చెప్పనేలేదు కదూ? ఆబిడ్స్‌లో చిరాగ్ అలీ లేన్ అని వుంది తెలుసుకదూ! అందులోకెళ్ళి కుడివేపుకు తిరిగితే ఒక పెద్ద ఆకుపచ్చ బంగళా కనిపిస్తుంది. దానికో అవుట్ హవుస్ వుంది. గుమ్మం వీధిలోకే వుంది. అందులో వుంటాడు వాసు. నేను వుండను. నువ్వు నిశ్చింతగా, నిర్భయంగా వెళ్లు. ఎంత త్వరగా వెళితే అంత మంచిది. వాసుకి ఆడవాళ్ళ స్నేహం అయిష్టమే! అయినా ఆడ సంరక్షణ లేకుండా బ్రతకలేని అమాయకుడు. అందుకే యీ ఆదుర్దా. వెళతావు కదూ? నా బాధ్యత తీరిపోయింది. నిశ్చింతగా వెళ్ళిపోతున్నాను. నన్ను త్వరలోనే పూర్తిగా మరచిపొమ్మని పదేపదే ప్రార్థిస్తూ,

నీ,

వనజ."

# 8

రెండోరోజే, వనజ విడిచిపెట్టి వెళ్ళిన పుస్తకాలు తీసుకుని, అడ్రసు వెతుక్కుంటూ చిరాగ్‌అలీ లేన్‌లో కెళ్ళాను. ఆ బంగళా సునాయాసంగానే కనిపించింది. అవుట్‌హౌస్ కూడా కనిపించింది. తలుపులు వోరగా వేసి వున్నాయి. సందులోంచి చూశాను. క్రింద చాపమీద వాసు వెల్లెకిలా పడుకుని వున్నాడు. కళ్లు మూతలు పడి వున్నాయి. తిన్నగా తలుపులు తీశాను. బార్లా తెరుచుకున్నాయి. కాని వాసు కళ్లు తెరవలేదు. కాసేపాగి మెల్లిగా పిలిచాను, "వాసుగారూ! వాసుగారూ!" అని.

"ఆఁ, ఎవరు?" అంటూ కళ్ళు తెరిచి, "ఓ, మీరా?" అంటూ గాబరాగా లేచి నిలుచున్నాడు.

"అవును, నేనే. రమని....ఇవిగో వనజ పుస్తకాలు. కాలేజీలో మరిచిపోయింది."

"ఓ, అవా?... అలా వుంచండి."

చాపమీద పెట్టేశాను. ఇద్దరం మౌనంగా నిలుచున్నాము.

"నిలుచునే వున్నారు, కూచోరూ?" అన్నాడు చివరికి, మరిచి పోయిన మామూలు మర్యాదలు చప్పున జ్ఞాపకం వచ్చినట్టు. చుట్టూ

చూశాను.

"క్షమించాలి, కుర్చీలుగానీ, సోఫాలుగానీ లేవు" అన్నాడు అదోలా నవ్వుతూ.

"ఫరవాలేదు" అంటూ చాపమీదే కూర్చున్నాను. "మీరు కూచోండి" అన్నాను. వెళ్ళి ట్రంకుపెట్టెమీద కూచున్నాడు. మళ్ళీ మౌనం.

"మిమ్మల్ని వొకటి అడగాలని వచ్చాను" అన్నాను, కొ క్షణాల తర్వాత.

"వనజ గురించేనా?....నా కేమీ తెలీదు...." అనేశాడు గ గబా.

"కాదు, వనజ గురించి కాదు. వనజ గురించి నేనేమీ అ గను, మీరు చెప్పక్కర్లేదు....నా గురించే."

"మీ గురించా?"

"అవును, నా గురించే....నాకు ట్యూషన్ చెబుతారా?"

"మీకా?....వేళాకోళం కాదుకదా?"

"ఏఁ, ఎందుకనుకుంటున్నారట్లా?"

"మీరు....మీరు గోఖలే స్కాలర్ కదూ?"

"అయితే మాత్రం? నేను మీ దగ్గర నేర్చుకునేదే లేద టారా? ఇలాంటి స్కాలర్షిప్పులు మీకు మంచినీళ్ళప్రాయమన్న మాట మరిచిపోయినట్టున్నారు."

"నా సంగతి కాదు, మీ సంగతి చెప్పండి. నిజంగా మీకు ట్యూషన్ అవసరమా, లేక....ఇదొక మిషా...."

"మిషా? ....దేనికి?"

"ఈ బీదవాడికి సహాయం చేద్దామని...."

"ఓహో! మీ వూహలు వింతగా వున్నాయే? ...పోనీ, ఉ తంగా చెప్పండి...."

మారు మాట్లాడలేదు వాసు.

"ఏఁవిటి, అదీ ఇష్టంలేదా?"

"కాదు. నేను ఉచితంగా చెప్పను? కాని తక్కువవారి దగ్గర

ంత తీసుకుంటానో అంతే తీసుకుంటాను."

"మీ యిష్టం. మీరెంతంటే అంతే. ఎక్కువ కాదు, తక్కువ కాదు. సరేనా?"

"నేను రోజూ రాలేను. వారానికి మూడు రోజులు మాత్రం రాగలను."

"అలాగే కానివ్వండి .... ఇంతేనా ఇంకేమైనా వున్నయ్యా షరతులు?"

"లేవు. ఎప్పట్నుంచి రమ్మంటారు?"

"ఇవ్వాళ సాయంత్రం నించే కానివ్వండి."

"కాదు, రేపట్నుంచి వస్తాను. అయిదింటికి."

"సరే....తప్పకుండా వస్తారుకదూ? మీ కోసం ఎదురు చూస్తూంటాను—శలవు: నమస్తే" లేచాను.

"నమస్తే."

వచ్చేశాను.

## 9

అంతవరకు ట్యూషన్ సంగతి అమ్మ నాన్నలతో సంప్రదించనే లేదు! నాన్న నన్ను కాదనరన్న నమ్మకం మాత్రం వుంది. మధ్యాహ్నం మెల్లిగా అమ్మతో అన్నాను.

"ఏమో బాబూ? నాకు తెలీదు. మీ నాన్నగారి నడగాలి!"అంది.

రాత్రి భోజనాల దగ్గిర మళ్ళీ అడిగాను, "అమ్మా! నాన్నగారితో చెప్పావా?"

"ఏఁవిటీ? .. ఓహో, అదా....నువ్వే చెప్పరాదూ?"

"ఏఁవిటదీ?" అన్నారు నాన్న.

"మీ అమ్మాయికి ట్యూషన్ కావాలిట."

నాన్నగారు నమ్మలేనట్టుగా నాకేసి చూస్తూ, అన్నారు, "ఏమ్మా! నీకు ట్యూషనా? ....నువ్వు...."

అర్థోక్తిలో అందుకున్నాను, "గోఖలే స్కాలర్‌ని అంటారు, అంతేగా ..కాని నాన్నా! అది హైస్కూలు, ఇది కాలేజి. భూమ్యాకాశాల తేడా వుంది."

"ఓ....నీ యిష్టం....మరి, ఎవరి దగ్గిరా?"

"వాసుదేవరావుగారనీ...."

"మీ లెక్చరరా?"

"కాదు, ఈ సంవత్సరం బియస్సీలో యూనివర్సిటీ ఫస్టు వచ్చాడు."

"ఓహో, అతనా? పేరు విన్నాను....యిప్పుడేం చేస్తున్నాడూ?"

"ఏమీ లేదు. ట్యూషన్లు చెప్పుకుంటున్నాడు."

"ఏం, ఎమెస్సీలో చేరలేదా?"

"లేదు, ఇంకా పై చదువులు చదివే స్తోమత లేదట."

"అరె, పాపం!...."

ఇంతలో అమ్మ అందుకుంది, "ఆ అబ్బాయి నీ కెలా తెలుసే?"

"మా కాలేజిలోనే చదువుకున్నాడు కదమ్మా!"

"మరి ట్యూషనెక్కడా?"

"ఇక్కడే, మనింటికే వస్తాడు. వారానికి మూడురోజులు."

"ఏమండీ, ఏమంటారు?" నాన్నగారి నడిగింది.

"బాగానే వుంటుంది. ఆ అబ్బాయి చాలా తెలివైనవాడనీ విన్నాను."

"థాంక్స్ నాన్నా!"

"యూ ఆర్ వెల్‌కమ్!"

రెండోరోజు కాలేజీనించి రాగానే, తయారై ఎదురు చూస్తూ కూచున్నాను. రాడేమో అన్న అనుమానం కూడా వుంది మనసులో. కాని సరిగ్గా అయిదింటికి వచ్చాడు. డ్రాయింగ్‌రూంలో కూచున్నాము.

కాసేపాగి, ఇంకా "ఆలస్యం దేనికి?, తెండి పుస్తకాలు" అన్నాడు.

"ఇప్పుడే వస్తాను" అంటూ వెళ్ళి, ఫలహారాలు పట్టుకొచ్చాను.

"అరె, పుస్తకాలు తెమ్మంటే, ఇవేమిటి?"

"పుస్తకాలు యివిగో యిక్కడే వున్నాయి. ముందు యివి కానివ్వండి"

"ఉహుం, నేను తీసుకోను. నాకు అలవాటులేదు."

"చూడండి మాష్టారూ! మీకు కొత్తగా అలవాటు చేయించే వుద్దేశం మాకూ లేదు. కాని ఇది మొదటిరోజు కదా, అందుకని మా అమ్మ...."

ఇంతలోకి అమ్మ రానేవచ్చింది.

"అవును బాబూ!.... నేనే...."

వాసు దిగ్గున లేచి "నమస్కారమండీ!" అన్నాడు.

"నమస్కారం! కూచో బాబూ! కూచో!"

అమ్మ కూచున్నాకే కూచున్నాడు వాసు.

"వాసుదేవరావంటే నువ్వేనన్నమాట. మా అమ్మాయి నీ గురించి చాలా చెప్పింది. మావారు కూడా విన్నారట....ఊం, ఫలహారం తీసుకో బాబూ! సిగ్గుపడకు ...మరి బాబూ? నువ్వు భియస్సీలో ఫస్టు వచ్చావటగా, చదువెందుకు మానేశావు?"

"కుదురదు లెండి."

"ఏం, మీ అమ్మా, నాన్నా...."

"ఎవరూ లేరండీ. వంటరిగాణ్ని."

"అయ్యో పాపం! మరి, ఇన్నాళ్ళూ...."

"ఏవో ట్యూషన్ల మీదా, స్కాలర్‌షిప్పుల మీదా...."

"ముందు కూడా ఇలాగే జరగొచ్చుగా? కావాలంటే మా వారు కూడా మరికొన్ని ట్యూషన్లు...."

"ఒద్దులెండి....నా కసలు ఇంకా చదవాలనీ ఉద్యోగం చెయ్యాలనీ లేదు."

"మరి ఏం చెయ్యాలనుకుంటున్నావ్?"

క్షణమాలోచించి అన్నాడు, "నాకు కొంత రాయటం చేతనవును. దాన్నే ప్రధాన వ్యాపకంగా పెట్టుకోదలచుకున్నానండీ."

"అంటే, కథలూ నవలలూ రాస్తావా?"

"ఇంతవరకు రాయలేదు. తలచుకుంటే రాయగలనను కుంటాను. ఏవో కొన్ని కవితలు మాత్రం రాశాను.... కాని నాకు జర్న లిజంలో ఆసక్తి వుంది. కొంత ప్రవేశం కూడా వుంది. అప్పుడప్పుడు పత్రికలకు రాస్తుంటాను. ఏదైనా పత్రికలో చేరాలని వుంది."

"బావుంది. కాని, వాళ్ళు ఇచ్చే జీతాలు...."

"నా అవసరాలు కూడా పరిమితమే లెండి."

"సరే, బాబూ! ఇక మీ చదువులు కానివ్వండి" అంటూ అమ్మ వెళ్ళిపోయింది.

"ఇంకాస్త ఫలహారం తీసుకోండి మాష్టారూ! అప్పుడే ముగించారేం?"

"చాలు. ఇంత కూడా నేనెప్పుడూ తినలేదు__యిక యివి తీసేస్తే...."

"తీసేస్తా లెండి" ప్లేటూ అవీ తీసేశాను.

"మీరు నాకో మాట ఇవ్వాలి" అన్నాడు.

"ఇంకో షరతన్నమాట. చెప్పండి."

"ఇది మొదటిరోజన్నారు, ఫరవాలేదు. కాని ఇంకెప్పుడూ ఈ ఫలహారాల తతంగం పెట్టుకోవద్దు"

"అలాగే సార్!" అన్నాను చిరునవ్వుతో.

"ఇక పుస్తకాలు తియ్యండి"

"ఉండండి. నా షరతు కూడా ఒకటుంది."

"షరతా?"

"అవును. ఏం, అన్ని షరతులూ మీవేనా? ఒక్కటి కోరే భాగ్యంకూడా నాకు లేదా?"

అనుమానంగా అన్నాడు, "ఏమిటది! చెప్పండి"

"అదిగో అదే వొద్దంటున్నాను."

"అంటే?"

"మీరు నన్ను అండీ గిండీ అని పిలవొద్దు. మీరు నాకు గురువులు, నేను మీ శిష్యురాలిని. నన్ను ఏకవచనంతో పిలుస్తేనే బావుంటుంది."

"....కాని మీరు...."

"నేను ఎవరినైతే ఏం? మీ శిష్యురాలినేనని మాత్రం మరిచి పోకండి"

కొంతసేపు నన్ను తేరిపార జూసి, "సరే, అలానే కానీ" అన్నాడు.

"ఇవిగోనండి పుస్తకాలూ"

వెంటనే పాఠాలు ప్రారంభించాడు.

వారానికి మూడురోజులు తు.చ. తప్పకుండా వచ్చేవాడు. పాఠాలు అతి శ్రద్ధగా చెప్పేవాడు. నేనే అప్పుడప్పుడు పాఠాలను తప్పించి ఇతర విషయాలగురించి అడుగుతూండేదాన్ని. ఏ విషయం అడిగినా తెలియదనకుండా, చిన్న పిల్లలకు సహితం అర్థమయే ధోరణిలో ఎంతో ఓర్పుతో చెప్పేవాడు. ఒకసారి అంతా చెప్పి, "ఇవన్నీ నువ్వెందుకు అడుగుతావో నేనెందుకు చెబుతానో నా కర్థం కాకుండా వుంది. వీటికీ నీ పాఠాలకూ సంబంధమే లేదు" అన్నాడు.

"జీవితంలో వీటికున్న విలువ చచ్చు పాఠ్యగ్రంథాలకి వుంది అంటారా మాష్టారూ?"

"దేని విలువ దానిదే. అయినా పాఠాలు పూర్తికావాలిగా."

"అవే అవుతాయిలెండి. మీరు అండగా వుండగా నాకేం భయం?" అన్నాను, అతని కళ్లల్లోకి చిలిపిగా చూస్తూ.

వాసు తికమకపడ్డాడు. వెంటనే కళ్ళు దించేసుకుని పాఠ్య పుస్తకం తీశాడు.

వాసు ట్యూషన్ చెప్పే మూడు రోజుల్లో ఆదివారం లేదు. ఆదివారం తమ్ముడు వుంటాడు ఇంట్లో. వాడితో పరిచయం చేయించా లన్న మిషమీద ఒక ఆదివారం రమ్మని బ్రతిమాలాను. వచ్చాడు. ఆ రోజు పాఠాలు లేవు. ముగ్గురం కబుర్లు చెప్పుకుంటూ కూచున్నాం, చాలాసేపు.

ఆ తర్వాత ప్రతి ఆదివారం రావటం అలవాటుగా మారింది. మాకు తెలియని విషయాలు వాసు చెబుతోంటే వింటూ కూచునే వాళ్ళం, నేనూ రాంబాబు. వాటిలో అప్పుడప్పుడు మార్క్స్, ఎంగిల్స్,

లెనిన్, కాపిటలిజం, సోషలిజం, కమ్యూనిజం అనే పదాలు దొర్లుతూ వుండేవి. సమాజంలోని ఎత్తు పల్లాల గురించీ, కులమత భేదాల గురించీ ఏకధాటిగా ఉపన్యాసాలిస్తోంటే, అతి శ్రద్ధగా వింటూండేవాడు రాంబాబు. కొన్నికొన్ని ప్రశ్నలుకూడా వేస్తూండేవాడు. నాకు మాత్రం చాలా మట్టుకు అయోమయంగానూ, విసుగ్గానూ వుండేది. కాని అప్పటి ఆ వాసు కళ్లల్లో ప్రజ్వలించే కాంతికి మంత్రముగ్ధనై రెప్పవెయ్యకుండా చూస్తూ కూచునే దాన్ని. నేను ఒక్క ప్రశ్నా వెయ్యకపోతే నిరాశ కలిగేదేమో, ఒకసారి అడిగేశాడు, "ఏం రమా! నీకు నేను చెప్పేది పూర్తిగా అర్థమైందని అనుకోవాలా, లేక బొత్తిగా అర్థం కాకుండా పోతోందని అనుకోవాలా?"

నేను కేవలం చిరునవ్వుతో సమాధానమిచ్చాను. అతనూ రెట్టించలేదు.

ఇంటర్‌మీడియెట్ పరీక్షలై పోయాక కూడా ప్రతి ఆదివారం వాసు వచ్చేవాడు. అప్పుడప్పుడు మా బలవంతాన ఫలహారంకూడా చేసేవాడు. కాని సినిమాకు రానసేవాడు. ఒక ఆదివారం నేను మరీ బలవంతం చేస్తే ఏ కళనున్నాడో సినిమాకి రావటానికి వొప్పుకున్నాడు. నా సంతోషానికి మేరలేదు. మా కారులోనే వెళ్ళాము. నేను డ్రైవ్ చేశాను. బలవంతాన వాసును నా ప్రక్కన కూచోబెట్టాను. తమ్ముడు వెనకసీట్లో కూచున్నాడు. సినిమా హాల్లోకూడా నేను ఇద్దరిమధ్యా కూచున్నాను. నన్ను అంటీ అంటనట్టు కూచున్నాడు. ఏమరుపాటున నా చెయి తగిలినా వెంటనే లాగేసుకునేవాడు. నాలో నేనే నవ్వుకునే దాన్ని.

ఇంటర్‌వెల్‌లో గబగబా బయటికెళ్ళాడు "ఇప్పుడే వస్తా" నంటూ. నాకు అనుమానం వేసింది ఇంటికి చెక్కేస్తున్నాడేమోనని. కాసేపటికి నేనూ వెళ్ళాను. సిగరెట్ కాలుస్తూ కనిపించాడు. నేను చాటున నిల్చున్నాను. అప్పటికే ఒక సిగరెట్ కాల్చేసినట్టున్నాడు. దాంతోనే మరోటి వెలిగిస్తున్నాడు. అప్పుడప్పుడు గుమ్మంకేసి చూస్తూ అంత ఆదుర్దాగా సిగరెట్ కాల్చటంచూసి, పాపం! మా ఎదుట

వున్నంతసేపూ సిగరెట్ తాగలేక ఎంత బాధపడుతున్నాడో అర్థమైంది.
కాలివేసింది. వెంటనే అతని కంట పడకుండా హాల్లోకి వచ్చేశాను.

## 10

ఇంటర్ పరీక్ష ఫలితాలొచ్చాయి. నేను స్టేట్ ఫస్టు రావాలని
ాసు తాపత్రయం, కాని రాలేదు. ఫస్టు క్లాసు మాత్రం వచ్చింది.

ఫలితాలొచ్చి రెండు మూడు రోజులైనా వాసు రాలేదు.
ంందులో ఆదివారం కూడా దాటిపోయింది. ఇక వుండలేక నేనే
ెళ్ళాను అతని గదికి. ఎటో చూస్తూ ఆలోచించుకుంటూ కూచున్నాడు.
ేతి వేళ్లల్లో సిగిరెట్ కాలుతోంది. నన్నుచూసి అదిరిపడ్డట్టు "అరె,
ీమాః నువ్వాః" అంటూ, సిగరెట్ నేలకు రాసేసి ఆర్పేశాడు. నేనది
ఁమనించనట్టే నటించాను.

"అవును, నేనే....ఏం, రాకూడదాః"

"అదికాదు...."

"ఏదికాదుః... మీరేమో రావటం మానేశారు...."

"ఇంకెందుకనీ...."

"ఏంః"

"రిజల్ట్సకూడా వచ్చేశాయిగా...."

"తెలుసన్నమాట .... తెలిపికూడా రాలేదు. కనీసం నాకు
కంగ్రాచ్యులేషన్స్ చెప్పటానికైనా...."

"దేనికనీః"

"నాకు క్లాసు వచ్చిందని."

"అందుకే రాలేదు."

"అంటేః"

"నేను ఆశించింది ఫస్టు క్లాసు కాదు; నేను ట్యూషన్ చెప్ప
కుండానే నీకు క్లాసు వచ్చేది...."

"మాష్టారూః మిమ్మల్ని డిసపాయింట్ చేశాను, క్షమించండి..
అయినా ఇది ఇంటరే కదండీ, బియస్సీలో తప్పకుండా స్టేట్ ఫస్టు
వస్తాను, సరేనాః"

వాసు కళ్ళు మెరిశాయి. హుషారుగా అన్నాడు, "నిజంగా

నువ్వు బియస్సీలో చేర్తావా రమా?"

"అదేంవిటి, అలా అడుగుతున్నారు? నేనిక చదువే మానేస్తా ననుకున్నారా?"

"అహఁ, అలా కాదు. బియస్సీలో చేరవేమోనుకున్నాను."

"మరి ఎందులో చేర్తాననుకున్నారు?"

"సైన్సు తీసుకున్న అమ్మాయిలు చాలామంది మెడిసన్‌కు ట్రైచేస్తుంటారు."

"అమ్మో! మెడిసనే?....ఆ కోతలూ, పూతలూ నావల్ల కావు బాబూ!"

"మరి ఏ కాలేజీలో చేరాలనుకున్నావు?"

"మరో కాలేజెందుకూ, మన కాలేజే....రేపట్నించి మళ్ళీ మన ట్యూషన్ మొదలు."

"ట్యూషనా?....నేనా?"

"ఏం? చెప్పరా?"

"....ఇంకెవరైనా ఎమ్మెస్సీ చదివినవారిని...."

"అక్కర్లేదు. నాకు మీరే చాలు. మీ గైడెన్స్ వుంటే నేను స్టేట్ ఫస్టుకూడా వస్తానని హామీ ఇస్తున్నాను....మరి, రేపట్నించి వస్తారుకదూ?"

"అంత తొందరెందుకూ?"

"తొందరే. ఫస్టు రావాలంటే మాటలా?"

"....సరే."

"థాంక్స్....మాష్టారూ!మీరేమీ అనుకోనంటే మిమ్మల్నొకటి అడగనా?"

"ఎందుకనుకుంటానూ?....అడుగు."

"....ఎన్నాళ్ళబట్టో మనసులో మెదలుతూన్న విషయం అది. కాని అడగటానికి ధైర్యమాగలేదు."

"అంత అడగరాని విషయమా?"

"ఏమో, అది మీరే చెప్పాలి."

"అడుగు, చూద్దాం"

"....వనజ....వనజ ఎలా వుందండీ?"

"వనజా?" ఒక్కసారి వాసు మొహం వాడిపోయింది.

"అదుగో, అప్పుడే మీ మొహంలో ఎంత మార్పు వొచ్చేసింది!...."

"....వనజ సంగతి నాకు తెలీదు" అన్నాడు గంభీరంగా.

"ఎక్కడుందో కూడా తెలీదా?"

"తెలీదు."

"చిత్రంగా వుందే! ఆ అమ్మాయి పాపం, మీకోసం యెంత శ్రమపడ్డదీ, ఎన్ని త్యాగాలు చేసిందీ, మీరేమో....మాష్టారూ! నిజంగా మీరింత కఠినాత్ములా?...."

వాసు కాస్త మెత్తబడ్డాడు.

"అవును, రమా! వనజ విషయంలో నేను కఠినాత్ముణ్నే. ఎందుకో అడక్కు. చెప్పలేను. నాకే తెలీదు."

"....పోన్లెండి మాష్టారూ! ఆ విషయం యెత్తి మీ మనసుకు బాధ కలిగిస్తే క్షమించండి.... అన్నట్టు మీ రచనలెలా సాగుతున్నాయి?"

"రచనలా?"

"అదే జర్నలిజం అనుకోండీ. ఏదో పత్రికలో చేర్తామన్నారుగా?"

"చేరాను. కాని లాభం లేదనుకుంటా."

"ఏం?"

"నా భావాలు వాళ్ళకు నచ్చవు. వాళ్ళు ఆదేశించినట్టుగా రాయటానికి నా మనసొప్పదు. ఈపాటికే రెండు పత్రికలు మారాను...."

"పోనీ, కథలూ, నవలలూ...."

"అవీ ప్రయత్నం చెయ్యాలనుకుంటున్నాను. ముందు ఒక నవల మొదలెట్టాలని వుంది. కాని సరైన కథా వస్తువు లేదు."

"నేన్చు చెప్పనా?"

"చెప్పు."

"వనజ జీవితాన్ని...."

"రమా!!" పెద్దగా అరిచాడు. నేను అదిరిపడ్డాను.

"సారీ, ఆ పేరెత్తొద్దన్నారు కదూ...."

"అవును, ఇంకెప్పుడూ యెత్తకు. తెలిసిందా?" కోపంగానే అన్నాడు.

"తెలిసింది"

"ఇక వెళ్ళు"

"వెళ్తాను.... రేపట్నించి మీరు వస్తున్నారు కదూ?"

"ఊఁ."

"తప్పక రావాలి, లేకుంటే నేనూరుకోను...." అంటూ వచ్చేశాను.

## 11

బియస్సీలో చేరాను. ట్యూషన్ సాగుతోనే వుంది. ఇంకొంచం చనువు ఏర్పడింది. "ఇవ్వాళ పాఠాలు వొద్దులెండి, అలా వెళ్ళి పార్కులో కబుర్లు చెప్పుకుందాం, పదండి" అంటే, ఆదివారాలైతేనే వస్తానన్నాడు. సినిమా ఎగ్గొట్టి పార్కులో కూచునేవాళ్ళం ముగ్గురం. ఎన్ని కబుర్లు చెప్పినా, అన్నీ రాజకీయాలేగాని, తన విషయంగానీ, వనజ విషయంగానీ ఎన్నడూ ఏమరుపాటునకూడా ఎత్తకపోయేవాడు. ఎమ్మెస్సీలో చేరమని ఎంతో బ్రతిమాలాను. ససేమిరా ఒప్పుకోలేదు. పోనీ ఉద్యోగం చేస్తాడేమో కనుక్కోమన్నాడు నాన్నగారు. ఈ జన్మలో చెయ్యననేవాడు. అతని స్వభావం తెలిసినదాన్ని కాబట్టి నేను వత్తిడి చేసేదాన్ని కాదు.

అప్పుడప్పుడు అతని గదికి వెళ్ళి అంతా శుభ్రంచేసి వస్తూ వుండేదాన్ని. అలా రావద్దని కఠినంగానే వారించేవాడు కాని ఆ విషయంలో నేను మొండికేసి వెళుతూ వుండేదాన్ని. నాకు తెలుసు, అతని హృదయంనిండా నామీద ప్రేమ వుందని. ఆ ఆరాధన అతని కళ్ళల్లో కొట్టొచ్చినట్టు కనిపిస్తూండేది. అప్పుడప్పుడు ఆ కాంక్షకూడా పొడసూపుతూండేది. కాని అపార నిగ్రహశక్తి గల మనిషి. నేనెంత చనువుగా వున్నా, నాకు దూరంగానే వుండేవాడు. పొరపాటునకూడా నన్ను తాకేవాడు కాదు. 'ఫరవాలేదులే, ఏ నాటికైనా నువ్వు నావాడివే,

ఈ బింకం ఎన్నాళ్ళులే' అనుకుని నాలో నేనే మురిసిపోతూ వుండే దాన్ని.

## 12

అలా దాదాపు రెండు సంవత్సరాలు గడిచాయి. బియస్సీ పరీక్షలు దగ్గిరి కొచ్చాయి. వాసు ప్రతిరోజూ రావటం మొదలెట్టాడు, పాఠాలు చెప్పడానికి. నేను యూనివర్సిటీ కంతకూ ఫస్టు రావాలన్న తాపత్రయం మరీ హెచ్చింది వాసుకు. నా అశ్రద్ధకీ, అనాసక్తికీ విసుక్కునేవాడు, మందలించేవాడు. అప్పుడప్పుడు చీవాట్లుకూడా వేసేవాడు. అన్నిటికీ మందహాసం ఒక్కటే సమాధానంగా కూచునేదాన్ని. దాంతో అతనికి మరీ చిరాకెత్తేది. ఒకసారి నాన్నగారితోకూడా ఫిర్యాదు చేశాడు. ఆయన, "అదేఁవిటమ్మా! అతను అంత శ్రద్ధగా చదివిస్తోంటే చదవటం లేదటా?" అన్నారు, 'పోనీ, పాపం, అతని కోసమైనా చదవరాదా?' అన్న ధోరణిలో.

"మీకేందుకు నాన్నా! నేను ఫస్టు వస్తాగా. మీరు చూస్తూ వుండిండి" అన్నాను. ఆయన అంతకే సంతోషించి వెళ్ళిపోయారు. వాసు మాత్రం నాకేసి కోపంగా చూస్తూ వుండిపోయాడు.

పార్కుకి వెళ్ళడం కూడా మాన్పించేశాడు. ఎప్పుడూ పాఠాలు పాఠాలు అంటూ ప్రాణాలు తోడేసేవాడు.

ఒకరోజు మొండికేసుకుని కూచున్నాను గదిలోకి పుస్తకాలు తీసుకురాకుండా. రాగానే, "అదేఁవిటి, పుస్తకాలేవీ" అన్నాడు వాసు.

"ఉహూఁ, ఇవాళ పాఠాలు లేవు" అన్నాను.

"ఏఁ?"

"పార్కుకెళ్దాం."

తీక్షణంగా చూపి, "పరీక్షలయేదాకా పార్కులూ, సినిమాలూ లేవన్నానా?" అన్నాడు.

"అన్నారు....కానీ, ఇవాళ వెళ్ళాలి."

"ఏం?"

"మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి."

"ఇక్కడే మాట్లాడరాదూ?"

"ఊహుఁ, ఇక్కడ కాదు, అక్కడ."

"దేనిగురించో చెబుతావా?"

చెప్పాలా ఒద్దా అని ఆలోచించాను. మరీ మొండికేస్తే రాదేమోనని చెప్పేశాను. "నా గురించే."

"నీ గురించా?—అంటే?"

"నా చదువు గురించి."

"చదువు గురించే అయితే ఇక్కడే ఎందుకు మాట్లాడ కూడదూ?"

"చెబుతాగా, పదండి."

అయిష్టంగానే, "సరే, పద" అన్నాడు. అయిదునిముషాల్లో బయలుదేరాము.

పార్కులో మేము మామూలుగా కూచునే స్థలానికి చేరుకున్నాము. లాన్‌పైన చతికిలబడగానే అందుకున్నాడు వాసు, "ఊఁ, చెప్పు. ఏఁవిటి సంగతి?"

"అబ్బ! ఉండండీ, అంత తొందరేఁవిటీ?....ఏయ్ అబ్బీ! ఇలారా" అని కేకవేశాను, ఐస్‌క్రీం వాడిని. రెండు ఐస్‌క్రీం కోన్లు కొనుక్కుని, ఒకటి వాసుకు అందించాను. తిన్నగా తినుకుంటూ కూచున్నాను. వాసు కూడా మాట్లాడకుండా తింటున్నాడు.

కాసేపయాక, "చూడు వాసూ!" అన్నాను.

ఉలిక్కిపడ్డాడు వాసు, నా ఏకవచన ప్రయోగానికి విస్తుపోతూ.

"ఏం, అలా పిలవకూడదా?" అన్నాను చిరునవ్వుతో.

తేరుకుని, "ఎలా పిలిచినా నాకు అభ్యంతరంలేదు. కాని ఇది దేనికి నాంది?" అన్నాడు.

"మన సంభాషణకు."

"అయితే కానీ."

నేను యెట్లా మొదలెట్టాలో తోచక మౌనంగా కూచున్నాను. వాసు ఓపిక నశిస్తోంది. విసుగ్గా అన్నాడు. "ఏఁవిటో, యిలా సమయాన్ని వృధాచెయ్యటం యెందుకో నాకు అర్థం కాకుండా వుంది."

"ఏం చేస్తే వృధా కాదంటావ్? పాఠ్యగ్రంథాలు వల్లె వేస్తేం

ఉనా?....సరే, నువ్వనుకున్నట్టే, నువ్వు కోరుకున్నట్టే నేను బాగా చదివి ఫస్టు వస్తాననుకో. ఆ తర్వాత?"

"ఎమ్మెస్సీ చెయ్."

"చేసి?"

"....పి. హెచ్. డి. కూడా చెయ్యొచ్చు."

"చేసి?"

"బావుంది ధోరణి. నీలాంటి తెలివీ, స్తోమతగలవాళ్లు చదవకపోతే యెలా?"

"తెలివి తెలివి అంటూ తెగపొగిడేస్తావే, ఆ తెలివే ప్రేరేపిస్తోందీ ప్రశ్నలు. ఇన్ని ఫస్టుక్లాసు డిగ్రీలు నాకెందుకూ? ఉద్యోగాలు చెయ్యనా, ఊళ్ళేలనా? అసలు అలాంటి డిగ్రీ నీకే పనికిరాకుండా పోయిందే?....ఇంతకూ, నా గురించి మా అమ్మా నాన్నా వాళ్లు ఏమాలోచిస్తున్నారో తెలుసా?"

"ఏంవిటి?"

"పెళ్ళి."

"పెళ్ళా?....నీకా?" షాక్ తిన్నవాడిలా అయిపోయాడు వాసు.

"నాకే....ఏం? తప్పా? ఎదిగిన ఆడపిల్లకు పెళ్ళి చేసెయ్యాలనే ఆదుర్దా వుండదా తల్లిదండ్రులకు?"

వాసు మౌనంగా తల వంచేసుకున్నాడు.

"మా నాన్నగారు తన పలుకుబడినీ, డబ్బునూ ఉపయోగించి ఓ పెద్ద ఆఫీసర్నో, బిజినెస్ మాగ్నట్నో సంపాదించగలడు. ఆ కాబోయే భర్తగారికి నా ఫస్టుక్లాసు డిగ్రీలెందుకు పనికివస్తాయి? అలంకారానికో చచ్చు పాస్‌క్లాస్ డిగ్రీ అయినా సరిపోతుంది. అందంగా అలంకరించుకుని ఆయనవెంట క్లబ్బులకూ, సినిమాలకీ, పార్టీలకీ తిరిగి, నలుగురితో నాలుగు ఇంగ్లీషుముక్కలు మాట్లాడగలిగితే చాలు. ముచ్చటగా ముగ్గురు పిల్లల్ని కని, వాళ్ళనీ ఇంటినీ చక్కబెట్టుకుంటూ ఆదర్శగృహిణిగా చలామణీ అవగలిగితే చాలు. ఇంత మాత్రానికి ఈ డిగ్రీలెందుకూ? ఈ అవస్థ దేనికీ?"

వాసు నిట్టూరుస్తూ అన్నాడు, "హూఁ, మరి ఇంతమాత్రానికే

ఇన్నాళ్ళూ నన్ను మభ్యపెట్టిందెందుకో?"

"మభ్యపెట్టానా?....నిన్నా?....ఎలా?" ఆత్రంగా అడిగాను, యిప్పటికైనా బయటపడ్డాడేమోనన్న ఆశతో.

వాసు మాట్లాడలేదు. చాలాసేపు మౌనంగా కూచున్నాడు. ఆఖరికి అన్నాడు, "నువ్వు బాగా చదివి తప్పకుండా ఫస్టువస్తావని ఆశపడ్డాను."

"చదువుతాను. తప్పకుండా చదువుతాను. ఫస్టు రావటాని క్కూడా ప్రయత్నిస్తాను. కాని ఒక్క షరతు."

"ఏఁవిటది?"

"నా తెలివీ, చదువూ అప్రీషియేట్ చెయ్యగల భర్త నాకు లభిస్తాడన్న గ్యారంటీ కావాలి."

"అది మీ నాన్నగారిని అడుగు."

"ఆ గ్యారంటీ ఆయన యివ్వలేరు."

"మరెవ్వరివ్వగలరు?"

"....నువ్వు."

"నేనా?....నేనా? ఎట్లా?" అర్థంకాక సతమతమైపోతున్నాడు.

"నన్ను పెళ్ళిచేసుకుని."

"నేనా?—నిన్నా?" మరీ ఆశ్చర్యపోతున్నాడు.

"అవును, నువ్వే....ఏం, నేను నీకు తగనా?"

"ఎందుకీ వేళాకోళం రమా?" దీనంగా అన్నాడు.

"వేళాకోళం కాదు, సీరియస్‌గా అంటున్నాను....నిజం చెప్పు వాసూ! నేనంటే నీకు ఇష్టంలేదా?"

నా కళ్ళలోకి తదేకంగా చూసి, తల వంచేసుకున్నాడు. మెల్లిగా అన్నాడు, "నాకు ఇష్టమైనవన్నీ లభిస్తాయని ఆశించేటంతటి మూర్ఖుణ్ణికాను రమా, నేను."

నాకు అవధులులేని ఆనందం కలిగింది. హృదయం పొంగి పోయింది. "చాలు. ఆ మాట అన్నావు, చాలు. తక్కింది నాకు వదిలేయ్. ఇక లే" అంటూ లేవబోయాను.

"అరెరే, అదేఁవిటి? నువ్వు పొరబడుతున్నట్టున్నావు.

నేనేమన్నానూ? ...”

"అన్నదే చాలు. తక్కిందంది నేను చూసుకుంటానన్నానుగా.”

"అహహా, అలాకాదు. నేనసలు ఒక నిశ్చయానికి రానిదే?”

"గడువు కావాలా? సరే, రేపు ట్యూషన్ కొచ్చేంతవరకు ఆలోచించుకో. కాని ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో. నీ నిర్ణయం గనక వ్యతిరేకమవుతే నేనసలు పరీక్షలకే వెళ్ళను.”

"అరే, అదేవిటి?....ఎందుకా మొండితనం?”

"ఏం, నువ్వొక్కడివే ననుకుంటున్నావా మొండివాడివి?”

వాసు సమాధానం చెప్పండా, ఆలోచనల్లో మునిగిపోయాడు. చివరికి "సరే. పద” అని లేచాడు. నేనూ లేచాను.

వాసు మళ్ళీ వస్తాడో రాడో అన్న సందిగ్ధావస్థలో గడిచి పోయింది రాత్రంతా. రెండో రోజు నిరీక్షిస్తూ కూచున్నాను. క్షణ మొక యుగంగా గడుస్తోంది. సాయంత్రం దగ్గిరపడుతోంటే గుండె దడ హెచ్చింది. ఆఖరికి ట్యూషన్ సమయం రానేవచ్చింది. రోజూ సరిగ్గా అయిదుగంటలకల్లా వచ్చేవాడు. ఆ రోజు రాలేదు. అయిదు పది, ఇరవై, ముప్ఫై నిముషాలు గిడిచిపోయాయి. అయినా రాలేదు. ఇహ రాడని నిశ్చయానికి రాబోతోంటే వచ్చాడు.

మనిషి ఉత్సాహంగా లేడు. దిగులుగా వున్నాడు. నేను చిరు నవ్వుతో పలకరించినా, ప్రత్యుత్తరం ఇవ్వలేదు. ఆఖరికి నేనే అడిగాను. "ఏవిటి మాష్టారూ! పుస్తకాలు తెమ్మన్నారా, ఫల హారాలు తెమ్మన్నారా?”

చివ్వున తలెత్తి చూశాడు అర్థం కానట్టు.

"మొదటిరోజు జ్ఞాపకముందా, ఫలహారం చేశారు. మరి ఇదే గనక చివరి రోజయితే మళ్లీ ఫలహారం చేసి పోరూ?”

వాసులో చలనంలేదు. అలానే చూస్తూ కూచున్నాడు. చాలా సేపటికి, చిన్నగా అన్నాడు "నీ ఇష్టం.”.

"గుడ్!” అని చివాలున లేచాను. "రెండూ తెస్తాను.”

ఫలహారం చేస్తూ అనబోయాడు "మీ అమ్మా, నాన్నా....”

అర్థోక్తిలో అందుకున్నాను, "అదుగో మళ్ళీ అదేనా. అంతా

నా ఇష్టమన్నావుగా? నాకు వదిలేయ్ .. ఉఁ, త్వరగా కానీయ్, ఆలస్యమవుతోంది. పరీక్షలకింకా పదిరోజులు కూడా లేవు. ఎంతో చదవాలి."

ఆ రోజునించి శ్రద్ధగా, అతిశ్రద్ధగా చదవటం మొదలెట్టాను. రాత్రింబవళ్లు కష్టపడి చదువుతోంటే అమ్మానాన్నలు ఆశ్చర్య పోయారు, వారించబోయారు. కాని నేను దీక్ష వదల్లేదు. వాసును మళ్లీ డిజపాయింట్ చెయ్యదలచుకోలేదు.

పరీక్షలొచ్చాయి. చాలా బాగా రాశానన్న తృప్తితో ఉప్పొంగి పోయాను, ఫస్టు వస్తానన్న కాదు, వాసును గెలుచుకుంటానన్న ధైర్యంతో. వాసు సంతోషానికి మేరలేదు.

## 13

పరీక్షలయ్యాక కూడా వాసు వస్తూనే వున్నాడు. పార్కులో కలుసుకుంటూనే వున్నాము.

ఈ మధ్య కవిత్వం యెక్కువగా రాస్తున్నట్టున్నాడు. రాసిం దల్లా నాకు ఉత్సాహంగా వినిపిస్తూండేవాడు. అక్కడక్కడ అర్థాలు కూడా చెబుతూండేవాడు. వాసు కవిత్వం శిలలపైన దొర్లుతూ ఉధృతంగా పారే సెలయేరులాగుండేది. ఉపమానాలూ యెంతో బాగా వుండేవి. కాని కొన్నికొన్ని పదాలు నాకు జుగుప్సాకరంగా వుండేవి. రుధిరం, ఖడ్గం, కంకాళం లాంటి పదాలు తరుచూ పడేవి. కవిత చదివేప్పుడు వాసు కళ్లల్లో కనిపించే ఎర్రజీరను చూసి నేను భయ పడేదాన్ని. ఉండబట్టలేక ఒకసారి అడిగాను, "వాసూ! యిదంతా యెందుకు రాస్తున్నట్టు?"

హతాశుడై, నిర్వీర్యంగా అన్నాడు, "అంటే....అంటే నేను రాసేదాంట్లో అర్థమే లేదంటావా?"

"అర్థం లేకపోలేదు. కాని ప్రయోజనం?" అన్నాను మొండి ధైర్యంతో.

"ప్రయోజనం అంటే?" అని వెంటనే తిరుగుప్రశ్న వేశాడు.

ఏం జవాబు చెప్పాలో తోచలేదు.

మళ్లీ అందుకున్నాడు వాసు, "రైల్వే గైడు చూశావు కదూ?

అందులోని రాతలకు ప్రయోజనం వుందికదూ?....నిజమే, అలాంటి ప్రయోజకత్వం నా కవిత్వానికి లేదు, నిజమే... కాని....కాని రమా! మనిషికి హృదయమంటూ వుంటే, ఆ హృదయానికి స్పందించేశక్తి వుంటే, మనిషికి కళ్ళు వుంటే ఆ కళ్ళకి ప్రపంచంలోని కుళ్లను గమనించగల దృష్టివుంటే, మనిషికి మెదడు అనేది వుంటే, ఆ మెదడుకి ఆలోచనలు ప్రేరేపించే సత్తువ వుంటే...?" ఉద్రేకంగా చెప్పుకుపోతున్నాడు. నేను మధ్యలో ఆపేశాను. "అదికాదు వాసూ! నన్ను అపార్థం చేసుకుంటున్నావు. కేవలం రాత పూతలతో నువ్వు ఆశించే మార్పు వస్తుందా? అని."

"కలంబలం నీకు తెలీదన్న మాట...."

ఇక లాభంలేదని మాట మార్చాను, "వాసూ! మా రిజల్ట్సు యెప్పుదొస్తున్నాయో తెలుసా?"

ఈ ఆకస్మిక మార్పుకు వెంటనే నోట మాటరాలేదు వాసుకు. మళ్లీ మామూలు మనిషైనాడు.

"ఏమో, తెలీదు... బహుశ, ఈ వారంలోనే వస్తాయేమో.... ఏం, భయంగా వుందా?"

"భయమేమిటి, కలలు కంటూంటే...."

"కలలా? దేని గురించి?"

"మన భవిష్యత్తు గురించి."

తల వంచేసుకున్నాడు. "ప్చ్! ఏమో రమా! నాకు నమ్మకం కలగటంలేదు."

"అంటే?"

"అంత సునాయాసంగా మీ వాళ్లు—"

"మళ్లీ మొదటికొచ్చావ్?....నా కిప్పుడు వయసెంతో తెలుసా? అమ్మా నాన్నల అంగీకారం అవసరంలేదు."

"ఎదిరిస్తావా?"

"అవసరమైతే....లే, పద, పోదాం, పొద్దుపోయింది" లేచాం.

మళ్లీ మేము పార్కులో కలుసుకున్నప్పుడు వాసు చేతిలో

ఏవో కొన్ని పుస్తకాలున్నాయి.

రాగానే అడిగాడు, "రమా! నీ కిప్పుడు తీరిగ్గానే వుంది కదా, ఏవైనా పుస్తకాలు చదువుతున్నావా?"

"ఓ."

"ఏఁవిటి?"

"పెర్రీమేసన్."

చకితుడై, జాలిగా చూశాడు.

"ఆ డిటెక్టివ్ పుస్తకాల మీదా కాలమంతా వృధా చేస్తున్నావు....?"

"మరి ఏఁ చదవమంటావ్?"

"ఇవిగో, ఇవి చదువు. బుద్ధీ, జ్ఞానం వికసించటమే కాకుండా నన్ను బాగా అర్ధం చేసుకునేందుకు కూడా పనికొస్తాయి."

పరేనని తీసుకున్నాను. అదంతా మార్క్సిస్టు సాహిత్యం. ఆ రాత్రి పిన్నియర్‌గానే చదవటానికి ప్రయత్నం చేశాను. కాని అంతా ...కమకగా వుంది. ఆవలింతలు రావటం మొదలెట్టాయి. పడుకొన్నాను.

రెండోరోజు అడిగితే, నాకు అర్ధంకావటం లేదని చెప్పాను. వాసు నమ్మలేకపోయినట్టుగా మొహం పెట్టాడు. "అంత తేలికైన భాషలో వుంటే అర్ధం కాకపోవట మేఁవిటో....పోనీ, ఒక పని చెయ్. నీకు అర్ధంకాని చోటల్లా అండర్‌లైన్ చేసి తీసుకురా, అర్ధాలు నేను చెబుతాను" అన్నాడు.

ఇక వదిలేట్టులేదని, నిజంగానే రెండు మూడు రోజులు కష్టపడి అంతా చదివాను. ఎన్నోచోట్ల గీతలు పెట్టాను. మరో రెండు మూడు రోజులదాకా వాటి అర్ధాలు యెంతో వోపిగ్గా చెప్పాడు వాసు. అతను చెప్పినంతసేపూ అవన్నీ బాగానే వుండేవి. మెదడుకు మేతగానే వుండేవి. కాని, ఎందుకో మనసులోకి దిగేవికావు. వాసుతో పేచీ ఎందుకు లెమ్మని అంతా అర్ధమైనట్టూ, నాకూ నచ్చినట్టూ నటించేదాన్ని.

# 14

అమ్మా నాన్నగార్లతో పెళ్ళి విషయం ప్రస్తావించే సదవకాశంకోసం ఎదురుచూస్తున్నాను. ఆఖరికి ఆ శుభముహూర్తం రానే వచ్చింది.

రాత్రి భోజనాల దగ్గిర నాన్న అడిగారు, "ఏమ్మా! ఎప్పుడు మీ రిజల్ట్సు?" అని.

"ఈ వారంలో రావచ్చు నాన్నా!"

"ఫస్టు వస్తావా?"

"ఏమో చూడాలి."

"ఆఁ రాకుంటే మాత్రమేం, ఉద్యోగాలు చెయ్యాలా ఏఁవిటి?" అంది అమ్మ.

"ఏఁ చెయ్యదలచుకొన్నావమ్మా?" అడిగారు నాన్న.

"ఎమ్మెస్సీలో చేరుతాను."

"ఇంకా అదెందుకే?" అంది అమ్మ.

"మరింకేం చెయ్యమంటావ్?"

"లక్షణంగా పెళ్ళి చేసుకో."

"అదీ చేసుకుంటాను" టకీమని జవాబు చెప్పాను.

"ఆఁ? పెళ్ళి చేసుకుంటావు, చదువు సాగిస్తావా? అలాంటి మొగుడు దొరకొద్దూ?"

"... ఉన్నాడులే."

"ఉన్నాడా? ఎవరూ?" ఆశ్చర్యంగా అడిగింది అమ్మ. నాన్నా తలెత్తి చూశారు.

"....వాసు" అన్నాను మెల్లిగా.

"ఆఁ, వాసుని చేసుకుంటావా?" ఇద్దరూ ఆశ్చర్యచకితులై నాకేసి చూస్తున్నారు. వాళ్ళు ఆ షాక్‌నుంచి తేరుకోక మునుపే నేను లేచి చేతులు కడిగేసుకుని నా గదికి దారితీశాను.

"అరెరే, అదేఁవిటే, అలా వెళ్ళిపోతావ్, ఆగు" అంటోంది అమ్మ.

నేను ఆగలేదు. గోడ చాటుకు వెళ్ళి వాళ్ళ మాటలు వింటు

న్నాను.

"నువ్వాగు సీతా! తొందరపడకు" అని అపారు నాన్న.

"ఏఁవిటండీ మీరనేదీ? అదేమందో విన్నారా?"

"ఆ, విన్నాను."

"మీకు చీమ కుట్టినట్టయినా లేదా?"

"మనమేం చేస్తాం?"

"ఏం చేస్తామా? నాలుగు చీవాట్లువేసి, దాని తలలో జేరిన జేజమ్మను దులిపేస్తాం."

"అదే వద్దంటున్నాను. అనవసరంగా అమ్మాయిని రెచ్చ గొట్టకు."

"అంటే, అది ఆ జులాయిగాణ్ణి చేసుకొంటాననంటూంటే!...."

"వాను తెలివైనవాడు, బుద్ధిమంతుడు."

"ఏం లాభం? ఉద్యోగమా సద్యోగమా? అసలు జీవితంలో స్థిరపడే లక్షణాలే లేవు."

"ఆ విషయం అబ్బాయితో నేను మాట్లాడుతానుగాని నువ్వేం తొందరపడకు. అమ్మాయి యిప్పుడు చిన్నపిల్ల కాదు. మైనారిటీ దాటింది. అదేగనుక మనల్ని ధిక్కరిస్తే, నిజంగా మనం ఏమీ చెయ్యలేము."

"అదేఁవిటండీ, తలిదండ్రులకు అంత మాత్రం హక్కు లేదా?...."

"లా ప్రకారం లేదు. మనం చేయగలిగిందల్లా మంచి చెడుల గురించి సలహాలివ్వటం. ఆ తర్వాత దాని ఇష్టం."

"బాగా చెప్పారు లెండి. ప్రపంచంలో అంతా అలానే జరుగుతోందేఁవిటి?"

"ప్రపంచం సంగతి కాదు, ఉన్న సంగతి చెబుతున్నాను.... ముందు నన్నా అబ్బాయితో మాట్లాడనీ, ఆ తర్వాత ఆలోచిద్దాం, ఏం చెయ్యాలో."

"ఇంకా ఏం చేస్తారు, ఏమీ చెయ్యలేమన్నారుగా?"

"చూద్దాం. కొంత ఓపిక పట్టు....ఈ లోపున అమ్మాయితో పేచీపడకు."

"సరే, దాని ఖర్మ యెలా వుంటే అలా జరుగుతుంది. నాకేం...."

నా మనస్సు కాస్త కుదుటపడ్డది. తిన్నగా మెట్లెక్కి గదిలోకి వెళ్ళిపోయి, గడియ వేసుకుని పడుకున్నాను.

చాలాసేపు నిద్ర పట్టలేదు. పొద్దుపోయిందాకా పడుకున్నాను. తలుపు కొడుతూంటే మెలుకువ వచ్చింది. లేచి తలుపు తెరిస్తే, నాన్నగారు నవ్వుతూ నిలుచుని వున్నారు. "కంగ్రాచ్యులేషన్స్! స్టేట్ ఫస్ట్ వచ్చావమ్మా."

నాకు అయోమయంగా వుంది.

"అప్పుడే రిజల్ట్సు వచ్చాయా నాన్నా?"

"రాలేదు. తెలిసింది."

"ఎలా?"

"వాసు చెప్పాడు. ఫోనులో వున్నాడు. వెళ్ళి మాట్లాడు."

సంతోషంతో పరుగెత్తాను.

"హల్లో వాసూ! నేను రమని."

"హార్టీ కంగ్రాచ్యులేషన్స్ రమా! విన్నావుగా, గెలుపు మనదే."

"విన్నాను. కాని....కాని ఇది నిజమా?"

"ఏం, నా మాటల్లో నమ్మకంలేదా!"

"కాని రిజల్ట్సు ఇంకా...."

"ప్రెస్సు కొచ్చేశాయి. రేపు పేపర్లల్లో వస్తాయి....రిజల్ట్సుతో బాటు నీ ఫోటో కూడా పేపర్లో పడుతుంది. మా ఫోటోగ్రాఫర్‌ని తీసుకుని సాయంత్రం వస్తాను, రెడీగా వుండు."

"అదెందుకూ?"

"అది అంతే. ఉంటాను."

చటుక్కున నా చేతిలోంచి నాన్నగారు ఫోను అందుకున్నారు. "హల్లో వాసూ? అంత తొందరేవిటయ్యా? సాయంత్రం ఫోటో

గ్రాఫర్‌తో వస్తావు సరే, కాని రాత్రికూ్కడా రావాలి భోజనానికి.... అహఁ, అలాంటి సాకులేవీ సాగవు! మా అమ్మాయిని ఫస్టు తెప్పించావు, నీకు పార్టీ ఇవ్వద్దూ?....తప్పకుండా రావాలి, అంతే" అంటూ పెట్టేశారు ఫోను. నేను సంభ్రమాశ్చర్యాలతో చూస్తూ వుండి పోయాను.

"అదేఁవిటమ్మా, అలా చూస్తూ నిలుచున్నావ్? వెళ్ళి మీ అమ్మకి చెప్పు—రాత్రికి ఏమేం వంటకాలు చెయ్యాలో ఏఁవిటో, అన్నీ నీ చేతి వంటకాలే వుండాలి," అంటూ వెళ్ళిపోయారు నాన్న.

అమ్మ దగ్గరికి అనుమానంగానే నడిచాను. అమ్మ తల పైకి ఎత్తకుండానే, "ఇప్పుడు లేచావా? వెళ్ళి మొహం కడుక్కొని రా, కాఫీ తాగుదువుగాని" అంది. దాంతో నా మనసు కాస్త కుదుట పడ్డది. కాని నా పరీక్షల ఫలితాల సంగతి ఎత్తదేం?

కాఫీ తాగుతూ నేనే మెల్లిగా అన్నాను, "అమ్మా! నేను బియస్సీలో స్టేట్ ఫస్టు వచ్చానట."

"అవును, విన్నాను," చప్పగా అంది.

"....ఏమ్మా! నీకు సంతోషంగా లేదా?"

"ఎందుకు లేదూ? అంతా సంతోషమే" అంది నిట్టూరుస్తూ.

ఇక లాభంలేదని లేచి వెళ్ళిపోయాను.

రాత్రి భోజనాలయాక అందరం హాల్లో కూచున్నాము. పరీక్ష ఫలితాల గురించి ఏమేమో అడుగుతున్నారు నాన్నగారు. వాసు సమాధానాలు చెబుతున్నాడు. అమ్మ ముభావంగానే వుండిపోయింది. ఉన్నట్టుండి నాన్నగారు, "మీరిద్దరు వెళ్ళి పడుకోండి. నేనూ వాసూ కాసేపు కబుర్లు చెప్పుకుంటాం" అన్నారు, అమ్మనూ నన్నూ ఉద్దేశించి. నాకు భయంవేసింది, నాన్నగారు ఏమడుగుతారో, వాసు ఏం జవాబులు చెబుతాడోనని. వెళ్ళాలనిపించలేదు. కాని వెళ్ళక తప్పలేదు.

## 15

రెండోరోజు నాన్నగానీ, అమ్మగానీ నాతో పెళ్ళి గురించి ఒక్క మాటా మాట్లాడలేదు. రాత్రి ఏం జరిగిందోనన్న ఆందోళన

మనసులోనే నిలిచిపోయింది. నాన్నగారు ఆఫీసుకు వెళ్ళిపోగానే, నేనూ తయారై, లీల దగ్గరి కెళ్తున్నానని చెప్పి, తిన్నగా వాసు గది కెళ్లాను.

వాసు దిగాలుగా చాపమీద కూచుని వున్నాడు.

నేను వెళ్లి ప్రక్కన కూచున్నా నన్ను మాట్లాడించలేదు. ప్రక్కనే పడున్న సిగరెట్ పెట్టె చేతికందిస్తూ, "వాసూ! నేన్నొ వచ్చాను" అన్నాను.

"అవును. వస్తావనే అనుకుంటూన్నాను."

"మరి ఎందుకలా దిగులుగా వున్నావు?....ఏం జరిగింది? నాన్నగారేమన్నారు?"

"నీకు తెలీదా?"

"నా కెట్లా తెలుసూ? మేం పైకి వెళ్ళిపోయాంగా?"

"ప్రొద్దున కూడా...."

"ఉహుఁ, నాతో ఆ విషయమే ఎత్తలేదు."

"పోనీ, వూహించలేవా?"

"అఫ్‌కోర్స్, అది చెయ్యగల్ను....పై చదువులు చదువూ, లేదా ఉద్యోగం చెయ్యీ, లేదా ఏదైనా బిజినెస్ చెయ్యీ, నేను పెట్టుబడి పెడ్తానూ....అనివుంటారు, అవునా?"

"అంతే కాదు. కావాలంటే స్వంత పత్రిక పెట్టుకో వచ్చన్నారు."

"నిజంగానా?" ఉత్సాహంగా అన్నాను. "మరి....మరి నువ్వే మన్నావు?"

"ఉహుఁ, కుదరదన్నాను."

"ఏం?....ఎంచేతా?"

"అదీ బిజినెస్ గనక?"

"కాని ఆ బిజినెస్‌లో నీ కనుభవం వుందిగా?"

"అలాంటి అనుభవంలేదు. నే నెప్పుడూ ఏ పత్రికా నడిపించలేదు. పత్రికల్లో పనిచేశాను. అంత మాత్రాన అందులోకి దిగి, బ్రతికి బయటపడే సత్తా నాలో వుందన్న భ్రమ నాకులేదు. అందులో,

ఇంకొకరి డబ్బుతో చెలగాటం ఆడలేను....నేను రచయితను, రచయితగానే బ్రతకాలని కృత నిశ్చయంతో వున్నాను."

"అయితే నాన్నగారేమన్నారు! ఈ పెళ్లి జరగటానికి వీల్లే దన్నారా?"

"....అక్షరాలా ఆ మాట అన్లేదనుకో."

"అనరు. నాకు తెలుసు. నేనంటే ఎంతో ప్రేమ. నువ్వంటే కూడా ఇష్టమే. ఎటొచ్చీ అమ్మే...."

"అది నేను అర్థం చేసుకోగలను. అందుకే నా బాధ."

"అంటే?"

"అంత మంచి తలిదండ్రుల మాట కాదని మనం ఏం బావు కుంటాం?"

"అయితే, మన అంతరాత్మల్ని కాదని బావుకుంటామా?.... ఏం, మాట్లాడవే?"

"ఏం మాట్లాడనూ?....నేను నీ గురించే ఆలోచిస్తున్నాను."

"నా గురించా?....నా సమాధానం కావాలా?....ఇలా రా!"

"ఏం?"

"చెబుతా, దగ్గరికి రా....ఇదిగో, ఇదే నా సమాధానం" అంటూ గభాలున వాసుని కావిలించుకుని, అతని పెదవుల్ని గట్టిగా ముద్దు పెట్టుకున్నాను.

"అరెరే, ఇదేవిటి రమా!...." అంటున్నాడు వాసు కంగారుగా.

"అంతే వాసూ! మన పెదవులపైన జీవితాంతం చెదరిపోని ముద్ర వేశాను? ఇక నేను నీదాన్ని, నువ్వు నా వాడివి. మనల్ని ఎవరూ విడదీయలేరు."

"అది కాదు రమా! కాస్త మన ఆర్థిక పరిస్థితుల గురించి కూడా...."

"మరేం ఫరవాలేదు. హాయిగా బ్రతుకుతాం."

"ఎలా? మీ నాన్నగారి ఆదరాభిమానాల పైన ఆధారపడా?"

"కాదు, మన కాళ్ళమీదే నిలబడి."

"అదే, ఎలాగంటున్నాను....నేను రచయితగా రాణిస్తానో లేదో తెలీదు. అందులో, నేను ఎలాంటి రచనలు చేస్తానో నీకు తెలుసు. పేరు వచ్చినా డబ్బు వస్తుందన్న నమ్మకం నాకు లేదు."

"అబ్బ! ఆ అనుమానాలన్నీ వదిలెయ్ వాసూ! నన్ను నమ్ము. నేను అంతా చక్కబరుస్తాగా.........ఊఁ, లే. బట్టలేసుకో, పోదాం...."

"ఎక్కడికి?"

"లీల ఇంటికి."

"లీలెవరూ?"

"నా స్నేహితురాలు. ఇప్పుడు వాళ్ళే మనకు బంధుమిత్రులంతాను. అక్కడే మన పెళ్ళి సన్నాహాలు జరుగుతాయి."

"పెళ్ళి సన్నాహాలా?"

"అవును....వొచ్చే ఆదివారం ప్రొద్దున్నే నువ్వూ నేనూ, లీలా దాని భర్తా, వాళ్ళ కార్లో యాదగిరిగుట్టకు వెళ్తున్నాము. అక్కడే దైవ సాన్నిధ్యంలో మన పెళ్లి....ఏఁవిటలా చూస్తావు?"

"ఉహుఁ, నేనక్కడికి రాలేను."

"ఏఁ?"

"నా భావాలు నీ కింకా తెలీవా?"

"సరే సరే" అంటూ ఆ వాగ్ధోరణిని మధ్యలోనే తుంచేశాను. "మరి....మరి మన పెళ్లి ఏ పద్ధతిలో జరగాలంటావు? పోనీ, రిజిష్టరు పెళ్ళి చేసుకుందామా?"

"చూడు రమా! పెళ్లి అనేది యిద్దరి మధ్య ఒక ఒప్పందం. నువ్వూ నేనూ కలిపి ఒక ఒప్పందాన్ని తయారుచేసుకుని, ఇద్దరు సాక్షుల ఎదుట మనం సంతకాలు చేసి, వాళ్ళచేత కూడా సంతాలు చేయిస్తే సరిపోలా?"

"దీనికి రెజిస్టరు పెళ్లికి తేడా ఏఁవిటో?"

"ఉంది. మన ఒప్పందంలో మనకిష్టమైన షరతులు పెట్టుకోవచ్చు."

"ఒద్దు బాబూ! నా కలాంటి పెళ్ళి ఇష్టంలేదు....పెళ్ళి అంటే

నా దృష్టిలో ఒక పవిత్రబంధం. అది రాతపూతల షరతుల మీద కాదు, ప్రేమమీద ఆధారపడివుండాలి."

ఆలోచిస్తూ కూచున్నాము. చప్పున ఒక ఐడియా తట్టింది. వెంటనే అన్నాను, "వాసూ! ఆర్య సమాజ్ పద్ధతి పెళ్లికి అభ్యంతరమా?....అక్కడ విగ్రహారాధన వుండదు. అగ్నిసాక్షిగా పెళ్ళి జరుగుతుంది, అంతే."

"....అందులోనూ నాకు నమ్మకంలేదు. కాని నువ్వు ఇష్టపడితే అలాగే కానీ."

# 16

అనుకున్నట్టే ఆదివారం పెళ్లిముహూర్తం పెట్టించాను. ఆర్యసమాజ్ మందిరంలో ఏర్పాటు చేయించాను. వాసు తన నలుగురు మిత్రుల్ని, నా నలుగురు స్నేహితురాళ్ళనూ ఆహ్వానించాము, అంతే.

నేనూ వాసూ చేతులు పట్టుకుని హోమం చుట్టూ ప్రదక్షిణలు చేసేప్పుడుపోయింది దృష్టి గుమ్మం వేపుకు. హఠాత్తుగా ఆగిపోయాము. నాన్న అమ్మలు వస్తున్నారు. వాళ్ళ ప్రఫుల్ల వదనాలు గమనించాక మా గుండెదడ తగ్గింది; హృదయాలు ఆనందంతో నిండాయి.

పెళ్ళి తతంగం పూర్తి కాగానే వెళ్ళి అమ్మా నాన్నల కాళ్ళకు మొక్కాము. ఇద్దర్నీ దీవించి, లేవనెత్తి, నన్ను కావలించుకున్నారు.

"పదండి" అన్నారు నాన్న.

"ఎక్కడికి?"

"ఇంటికి, ఇంకెక్కడికి" అంటూ, మా స్నేహితుల్నందర్నీ ఆహ్వానించారు.

కార్లో ఇంటికెళ్ళేసరికి, పచ్చని తోరణాలతోనూ, రంగు రంగుల అలంకరణలతోనూ కళకళలాడుతోంది బంగళా. ఇరవై ముప్పైమంది దాకా బంధువులొచ్చి వున్నారు.

మంగళసూత్రంలాంటి దొకటి సిద్ధంగా వుంది. దాన్ని వాసు చేతికిచ్చి నా మెళ్ళో కట్టమన్నారు. వాసు తికమక పడి, దిక్కులు చూస్తున్నాడు. 'గొడవ చెయ్యక, దయచేసి కట్టేయ్, ప్లీజ్!"

అన్నట్టు కళ్ళతోనే ప్రతిమాలాను. కట్టేశాడు.

తమ్ముడొచ్చి నన్ను చుట్టేశాడు. వాసుకు షేక్ హాండ్ ఇచ్చాడు.

రకరకాల వంటలతో విందులు జరిగాయి. సాయంత్రం భారీ యెత్తున రిసెప్షన్ జరిగింది. వాసును పట్టు పీతాంబరాలతోనూ, నన్ను బెనారస్ జరీ చీర జాకెట్ తోనూ అలంకరించి కూచోబెట్టారు. నాన గారి స్నేహితు లెంతోమంది వొచ్చి దీవించి వెళ్లారు.

రాత్రి నన్ను మళ్ళీ ముస్తాబుచేసి, అందంగా అలంకరించిన గదిలో మమ్మల్నిద్దర్నీ వంటరిగా వదిలేదాకా అంతా అయోమయంగా, అర్థంకాని స్థితిలో గడిచిపోయింది. వాసు నా చేతులు పట్టుకుని మంచంమీద కూచోబెట్టి, నా మొహం పైకెత్తి, "ఇదంతా ఏవిటి రమా?" అన్నాడు.

"కన్నవారి ప్రేమ"

"అది సరే, కాని మన ప్లాను వాళ్ళకు తెలీదన్నావుగా?"

"అన్నాను; అనుకున్నాను. కాని లీల ఇలా రెండు వేషాలు వేస్తుందని తెలీదు. దాని ద్వారానే నాన్నగారికి తెలిసిపోయినట్టుంది. మరో ప్లాను వేశారు."

"....మరి....మరి మన నిర్ణయాలు?" అన్నాడు కొంత దిగులుగా.

"వాటికేం ప్రమాదం లేదు వాసూ! ఇదంతా తాత్కాలికం, వాళ్ళ ఆనందం కోసం.తర్వాత మన జీవితాలు మన కాళ్ళమీదే సాగు తాయి, దిగులుపడకు."

ఆ మాటలతో వాసు మొహాన ముసురుతూన్న విచార రేఖలు విచ్ఛిన్నమైనాయి. కళ్ళల్లో వెయ్యి జ్యోతులు వెలిగాయి. ముద్దులు గొలిపే ఆ ముఖారవిందాన్ని చూస్తూ ఉప్పొంగింది నా హృదయ స్రవంతి. అమాంతంగా నన్ను బిగియార కౌగిలించుకుని ముద్దులవర్షం కురిపించాడు వాసు.

రెండోరోజు నేను యెవరికీ తెలీకుండా చేసిన మొట్టమొదటి పని మా కాలేజీ ప్రిన్సిపాల్ ని కలుసుకుని నాకు ఏదైనా ఉద్యోగం

జో ౧

ఇప్పించమని ప్రాధేయపడటం. అతను ఆశ్చర్యపోయాడు, కాని నేను చెప్పిందంతా విన్నాక మా నిర్ణయాల్ని మెచ్చుకున్నాడు. కాని నేను ప్రైవేటుగానైనా ఎమెస్సీకి కడతానని వాగ్దానం చేస్తేగాని ఉద్యోగం ఇప్పించనన్నాడు. నేనూ అదే కోరుకున్నాను కాబట్టి సరే అన్నాను. వెంటనే డిమాన్‌స్ట్రేటర్ పదవిలో చేరమని ఆర్డర్స్ జారీ చేశాడు.

వాసుకు తెలిసి చిన్నబుచ్చుకున్నాడు.

"ఏం వాసూ! మాట్లాడవేం, నీ కిష్టంలేదా?"

"నువ్వు ఏం చేసినా నాకు ఇష్టమే రమా! కాని....నా విషయమే ఆలోచిస్తున్నాను."

"అంటే?"

"ఇంతా చేసి ఆఖరికి భార్య సంపాదన మీద ఆధారపడి...."

అరచేయి నోటికి అడ్డంపెట్టాను. "చూడు వాసూ! నువ్వేదో అభ్యుదయవాది వనుకున్నాను. ఇంకా ఆ పాత ధోరణిలోనే ఆలోచిస్తున్నావా? దేశంలో నూటికి తొంభై శాతం భార్యలు భర్తల సంపాదన మీదే ఆధారపడి వుంటారు. ఏ కొద్దిమంది భార్యలో సంపాదించి భర్తలకు అండగా నిలిస్తే అందులో తప్పేముంది? ఈ భేదాలెందుకు? అందులో నువ్వు ఆర్జించబోయే సంపాదన నాదానికంటే చాలా గొప్పది, చిరస్థాయిగా నిలిచి వుండేది....ఇంక ఇంటి గొడవలన్నీ నాకు వదిలేసి వాసూ, స్వేచ్ఛగా, హాయిగా రాసుకుంటూ పో. నేను కోరుకునేదల్లా ఒక్కటే, ఏ నాటికైనా నేను ఓ గొప్ప రచయిత భార్యననిపించుకోవాలని...."

వాసు ప్రసన్నంగా నవ్వాడు. "అబ్బ! ఎంత స్వార్థం?"

నేను కిలకిలా నవ్వుతూ వాసుపైకి వొరిగిపోయాను.

లీలా నేనూ కలిసి, రెండురోజులు తిరిగి తిరిగి మెహదీ పట్నంలో ఒక చిన్న ఇల్లు నూటయాభైకి అద్దెకు కుదిర్చాము. వాసుని తీసికెళ్ళి చూపించి యెలా వుందని అడిగితే, "ఇంటికేం నాకో భవంతిలా వుంది. పట్నం వచ్చేసినప్పటి నించీ నేను ఒంటి గదిలో కాపరం చేసేవాణ్ని. తెలుసుగా?" అన్నాడు.

వెంటనే, అమ్మా నాన్నలు యెంత వారించినా వినక కొత్త ఇంట్లోకి మారాము. పెళ్ళికి పూర్వం నా దగ్గిరుండే బట్టలూ, నగలూ మాత్రమే వెంట తీసుకున్నాను. అమ్మా నాన్నగారు ఇవ్వబోయిన డబ్బుగాని, నగలుగాని ముట్టుకోలేదు.

## 17

మా దాంపత్య జీవితం మొదటి రెండు సంవత్సరాలు, ఆనందంగా గడిచాయి. స్వర్గసుఖాలనుభవించాము. వాసు ఇల్లు వదిలి వెళ్ళేవాడు కాడు. పత్రికల్లో అప్పుడప్పుడు వ్యాసాలూ కవితలూ రాయటం తప్ప వాటితో ప్రత్యక్ష సంపర్కం పూర్తిగా వదిలేసుకున్నాడు. నేను నోరుజారి అన్లేదుగాని, సిగరెట్లంటే నాకు ఏవగింపని తెలుసుకున్నాడేమో చాలామట్టుకు తగ్గించుకున్నాడు. నా ముందర యెప్పుడూ తాగేవాడు కాదు. నా ఎమెస్సీ పుస్తకాలన్నీ చదివి, లైబ్రరీకెళ్ళి నోట్సు రాసుకువచ్చి, అర్ధరాత్రిదాకా నన్ను కూచోబెట్టి చదివించేవాడు. ఆ సహాయంతో నేను సునాయాసంగా ఎమెస్సీ ఫస్టు క్లాసులో పాసయాను. వెంటనే నాకు లెక్చరర్ జాబ్ కూడా మా కాలేజీలోనే దొరికింది. మరో ఆరు నెలల్లోగా మా మొదటి పాప రజని పుట్టింది.

ఆ తర్వాతే ఆరంభమైనాయి ఒడుదుడుకులు మా జీవితంలో. వాసులో మెల్లి మెల్లిగా మార్పులు వచ్చాయి. నన్ను లక్ష్యపెట్టకుండానే మళ్ళీ సిగరెట్లు విపరీతంగా తాగటం మొదలెట్టాడు. పుస్తకాలు చదవటం, వ్యాసాలు రాయటం, కవితలు అల్లటం మరీ ఎక్కువైపోయింది. అంతే కాదు పార్టీతో ప్రత్యక్ష సంబంధంకూడా పెట్టుకుంటున్నాడేమోన్న అన్నమానం కలుగుతోంది. రానురాను నాకు దూరదూరంగా జరుగుతున్నట్టనిపించింది. నేను యెంత ప్రయత్నించినా మా మధ్య యెడం యెక్కువవుతూనే వుంది.

ఈ పరిస్థితుల్లోనే మా బాబు రవి పుట్టాడు. దాంతో నాకు పిల్లల పోషణలోనూ, ఇంటి పన్లూ, ఉద్యోగం పనులతోనే సరిపోయేది. వాసు సంగతి అట్టే పట్టించుకునే ఓపికా, వ్యవధీ లేకపోయేది. వాసువల్ల చెప్పుకోదగ్గ సహాయమంటూ వుండేది కాదు. పార్టీ పనుల్లో యెక్కడెక్కడో తిరుగుతూంటేవాడు. ఇంట్లో వున్న

ప్పుడు, మూడ్‌లో వుంటే పిల్లలతో ఆడుకునేవాడు, లేదా పార్టీ పత్రిక్కి వ్యాసాలూ, కవితలు రాస్తూ కూచునేవాడు. మరో పని చేసే వాడు కాదు. అయినా నేను, అంతా ఓర్చుకుని, పల్లెత్తు మాటకూడా అనేదాన్ని కాదు. నా హృదయంలో వాసు యెడల ప్రేమ తప్ప మరో భావానికి చోటివ్వకుండా జాగ్రత్తపడేదాన్ని.

కాని నా బాధంతా ఒక్కటే: వనజ కలలుకన్నట్టూ, నేను ఆశించినట్టూ, వాసు యెందులోనూ పైకి రాలేదు. ఆఖరికి రచయితగా కూడా అంతగా రాణించలేదు. ఆ కవిత్వంకూడా పార్టీకే పూర్తిగా అంకితమైపోయింది. ఆ పరిధిలోనే పరిపక్వం పొందుతూ వచ్చింది. కలం పేరు 'ఖడ్గతిక్కన'। యువక సాహితీ ప్రియుల్లో ఆ పేరు విప్లవ కవిగా మారుమ్రోగుతోంది.

## 18

ఒకరోజు మా కాలేజీలో 'స్టూడెంట్స్ యూనియన్' వాళ్ళు 'ఖడ్గతిక్కన కవితాగానం' ఏర్పాటు చేశారు. వాసు నాతో చెప్పనే లేదు. ఆ రోజు అసలు ఇంట్లోనే లేడు. సాయంత్రం హాలంతా పిల్లలతో క్రిక్కిరిసి వుంది. ముందు వరసలో తక్కిన స్టాఫ్ మెంబర్లతో బాటు నేనూ కూచున్నాను. ప్రిన్సిపాల్‌గారుకూడా వున్నారు.

పదిహేను నిమిషాలు ఆలస్యంగా వచ్చాడు వాసు. తెల్ల పైజామా, లాల్చీ, దానిమీద నల్లటి వేస్టుకోటు, కళ్ళకు నల్లటి గాగుల్స్, గుబురు గడ్డం, పూర్వపు కాలేజీ స్టూడెంటుకీ, ఇప్పటి వాసుకీ పోలికే లేదేమో, నేను తప్ప మరెవ్వరూ గుర్తించినట్టుగా లేరు.

'స్టూడెంట్స్ యూనియన్' ప్రెసిడెంటు తన పరిచయ వాక్యాల్లో 'ఖడ్గతిక్కన' గారి కవితను ఎంతెంతో పొగిడాడు. తర్వాత, లాంఛన ప్రాయంగా కవిగారికి శాలువా కప్పి, సన్మానించవలసిందిగా ప్రిన్సిపాల్‌గారిని వేదికపైకి ఆహ్వానించాడు. అది వినగానే వాసు దిగ్గున లేచి మైక్ అందుకున్నాడు. "క్షమించాలి. నేను ఈ సన్మానానికి అంగీకరించలేను. మాకు మా కవితా, అందులోని భావాలూ, వాటి ప్రయోజనమే ముఖ్యం గాని సన్మానాలూ, సత్కారాలూ కావు.

ఇక్కడ గుమిగూడివున్న నా తమ్ముళ్ళూ, చెల్లాయిలకు నా కవితను వినిపించి, సుషుప్తావస్థలో వున్న వాళ్ళ కళ్ళు తెరిపించి, వాళ్ళ లేత హృదయాలను స్పందింపచేయగలిగితే నాకదే పదివేలు" అని కూర్చు న్నాడు. హాలు కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది.

వాసు కంఠం వినగానే గుర్తుపట్టాడేమో ప్రిన్సిపాల్ ప్రశ్నార్థ కంగా నాకేసి చూశాడు. అవునన్నట్లు నేను తలూపాను.

ఇంత జరిగినా ప్రిన్సిపాల్ లేచి డయస్ మీదికి వెళ్ళటం అందరికీ విస్మయం కలిగించింది. వెళ్ళగానే మైక్‌లో అన్నాడు, "నేను కవిగారిని సన్మానించటానికి రాలేదు. ఒక్క విషయం, ఇప్పటి స్టూడెంట్స్ యెవరికీ తెలియని విషయం, చెప్పటానికి వచ్చాను. ఈ కవిగారు మరెవ్వరో కాదు, నా ప్రియ శిష్యుడు వాసుదేవరావు. ఈ కాలేజీ స్టూడెంటే. ప్రతి ఏటా ఫస్టు వస్తూ, ఆఖరికి బియస్సీలో యూనివర్సిటీ కంతకూ ఫస్టు వచ్చాడు...." కరతాళ ధ్వనులు మిన్నంటుతున్నాయి. "మన కాలేజీ సైన్స్ లెక్చరర్ శ్రీమతి రమా దేవిగారి భర్త ఈయనే" మళ్ళీ చప్పట్లు. అందరి దృష్టి నావేపుకు మళ్ళింది. సిగ్గుతో తల వంచుకున్నాను. "ఈ ఆదర్శ దంపతులకు నా ఆశీస్సులు....వాసు గొప్ప సైంటిస్టు అవుతాడని ఆశించేవాడిని, కాని అతను సైన్సును వదిలేసి కవితను చేబట్టాడు. కవిత్వం గురించి చెప్పే అర్హత నాకు లేదు. కాని ఇందాక యూనియన్ ప్రెసిడెంట్ చెప్పిన మాటల్నిబట్టి చూస్తే వాసు అందులోనూ ఆకాశాన్ని అందు కుంటూన్నట్టున్నాడు. నాకు చాలా సంతోషంగా వుంది. అతనికి నా అభినందనాలూ, ఆశీర్వాదాలూ....ఇంతే నేను చెప్పదలచుకుంది. ఇక మీ కార్యక్రమం కానివ్వండి" అని, వాసుతో కరచాలనం చేసి, వీపు తట్టి ,డయస్ దిగి వచ్చేశాడు.

ఆ తర్వాత వాసు తన కవితా పఠనం ప్రారంభించాడు. అది మామూలు కవితాగానంగా లేదు. హాలు హాలంతా అగ్నికణాలతో నిండి పోయినట్లు ప్రజ్వలించి పోతోంది. ఈలలతోనూ, చప్పట్లతోనూ, పెడబొబ్బలతోనూ, నవ్వులతోనూ దద్దరిల్లిపోతోంది. పిల్లలు కోరికోరి మళ్ళీ మళ్ళీ పాడించుకుంటున్నారు. అక్కడక్కడ వ్యంగ్యాన్ని

వదిలేసి సూటిగా, పచ్చిగా ప్రభుత్వాన్నీ, సమాజాన్నీ తిడుతూన్నప్పుడు నేను ఇబ్బందిగా ఫీలవుతూన్నాను. ప్రిన్సిపాల్ ఏమనుకుంటున్నాడో నని అతనికేసి భయం భయంగా చూస్తున్నాను. అతని మొహంలో రంగులు మారటం గమనించి నాకు ముచ్చెమట్లు పోశాయి. ఆ గందర గోళంలో అదను చూసుకుని, తిన్నగా బయటికి జారుకుని, ఇంటికి వచ్చేశాను. ఆ రాత్రి వాసు ఇంటికి రానేలేదు.

# 19

మరుసటిరోజు కాలేజీలో ప్రిన్సిపాల్ నన్ను తన గదికి పిలి పించాడు. మొదట కుశలప్రశ్నలు వేశాడు అమ్మా నాన్నల గురించీ, పిల్లలగురించీ. ఆ తర్వాత అడిగాడు, "వాసు ఇప్పుడెక్కడుంటు న్నాడు" అని.

"ఎక్కడుంటాడండీ, మాతోనే."

"అలాగా?....ఇప్పుడు చాలా ఎదిగిపోతున్నాడుకదా, అందు కని అడిగాను....అయితే రమా! నీకు అతని కార్యకలాపాల గురించి అంతా తెలుసన్నమాట....?"

నాకు కొంచం దడ పుట్టుకొచ్చింది.

"పెద్ద కార్యకలాపాలు ఏముంటాయి సార్! కవిత్వం రాస్తుం టాడు...."

"అదే అదే. అది యెలాంటి కవిత్వమో వినే వుంటావుగా! అది ప్రమాదకరమైన దారిలో పడ్డది కదూ?"

నేను నిశ్శబ్దంగా తల దించేసుకున్నాను.

"అసలు నిన్న అలాంటి సభ మన కాలేజీలో ఏర్పాటు చెయ్యాల్సింది కాదు. ఆ విషయమే ఇందాక యూనియన్ ప్రెసిడెంట్‌తో కూడా చెప్పాను. అది వేరు విషయం. నేనాలోచించేది నీ గురించి, నీ భవిష్యత్తూ, నీ పిల్లల భవిష్యత్తూ...."

"నాకు....నాకేమైందండీ? నేను ఆయనమీద ఆర్థికంగా ఆధార పడి లేనే....?"

"లేకపోవచ్చు. కాని యిదంతా ప్రభుత్వం దృష్టిలో పడితే ఎన్నాళ్లు సహిస్తుందా అని...."

"అంటే?" నాకు వణకు పుట్టుకొచ్చింది, "నా....నా ఉద్యోగం?...."

"నేనలా అనదలచుకోలేదు. కాని నిప్పుతో చెలగాటం మంచిది కాదని హెచ్చరిస్తున్నాను, అంతే....ఇక నువ్వెళ్ళొచ్చు."

ఆయన ముఖం గంభీరంగా మారిపోయింది. చూస్తేనే భయంగా వుంది. మాట్లాడకుండా లేచి వచ్చేశాను.

మధ్యాహ్నంనించి శలవుపెట్టి ఇంటికి వచ్చేశాను. వాసు ఇంట్లోనే వున్నాడు. నేను పలకరించలేదు. ముభావంగా వెళ్ళి మొహం, కాళ్ళూ చేతులూ కడుక్కుని వెళ్ళి పడగ్గదిలో మంచంమీద పడుకున్నాను.

వాసు నన్నే గమనిస్తున్నట్టున్నాడు. కాసేపటికి లోపలికొచ్చి, మంచంమీద కూచుని, "ఏం రమా! అలా దిగులుగా వున్నావేం?" అన్నాడు.

నేను మాట్లాడలేదు.

"ఒంట్లో బావోలేదా?" అంటూ నొసటిమీద చెయ్యివేసి, "చల్లగానే వుందే...." అన్నాడు.

"పైన చల్లగానే వుంటుంది. లోపలే ఉడుకుతోంది" అన్నాను కసిగా.

"ఎందుకు?....ఎందుకు రమా?"

"నీ కవిత్వ తాపానికి తట్టుకోలేక"

"ఓ, అదా....అనుకున్నాను. నిన్న నువ్వలా మధ్యలో లేచి వెళ్ళిపోతే అప్పుడే అనుకున్నాను, నువ్వు నా కవిత్వాన్ని భరించ లేకుండా వున్నావని, నామీద కోపం వచ్చేసి వుంటుందని....అందుకే రాత్రి రాలేదు."

"ఇలా రాత్రుళ్ళు రాకపోవటం ఇదేం కొత్తకాదు. అందుకేగా పనిపిల్ల లక్ష్మిని ఇంట్లోనే అట్టిపెట్టుకున్నాను....అయినా నేనెంతా, న కోపమెంతా! నువ్వు ఆర్చేవాడివా, తీర్చేవాడివా...."

"ఎలా తీర్చమంటావో చెప్పు రమా!....కవిత్వం మానెయ్య మంటావా?"

"రాసి తీరాలా?....తప్పదా?"

నా కళ్ళల్లోకి నిదానంగా చూసి అన్నాడు, "ఈ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పమంటావ్ రమా?....మనిషి వూపిరి తీసుకుతీరాలా? తప్పదా? అన్నట్టుంది....నీకు బాగా తెలుసు, నేను కవిత్వం రాయకుండా వుండలేనని, నా ధోరణిలోనే నేను రాయగలనని.... ఒకసారి నువ్వొక ప్రశ్న వేశావు జ్ఞాపకముందా? 'ఈ రాతలవల్ల ప్రయోజనమేఁవిటీ' అని. యువతరాన్ని ఉత్తేజపరిస్తే చాలునని జవాబు చెప్పాననుకుంటాను. దానికి నిదర్శనం నిన్న కాలేజీలో చూశావుగా.ఇప్పటికైనా అర్థమైందా?....అయితే ఒకటి, నన్నిప్పుడు మరో ప్రశ్న బాధిస్తోంది, రచయిత బాధ్యత కేవలం రచనల మట్టుకేనా అని...."

వెన్నుమీద చరిచినట్టు దిగ్గున లేచి కూచున్నాను. "వాసూ! యేఁవిటి నువ్వంటున్నది?....ఇంకా యేం చేద్దా మనుకొంటున్నావ్?...."

నా కంఠంలో భయం తొణికిసలాడిందేమో నన్ను ఆప్యాయంగా దగ్గిరికి తీసుకుంటూ, "ఎందుకలా అదిరిపడ్డావు రమా?....నేను ఏం చేసినా ప్రజల బాగుకోసమేనని...."

"ప్రజలూ, ప్రజలూ, ప్రజలూ! ఎప్పుడూ ప్రజలేనా నీకు? భార్యా పిల్లల గతేం కావాలో అక్కర్లేదా?" కోపంగా అరిచాను.

"అదేఁవిటి రమా! ఇప్పుడు మీకేమైందనీ?...."

"ఇంకా యేంకాలేదు. కాని నీ పుణ్యమా అని...."

"ఏఁవిటో నాకు కాస్త అర్థమయేట్టు చెప్పరాదూ?"

"నేను....నేను గవర్నమెంటు ఉద్యోగినని మరచిపోతున్నట్టున్నావు...."

"ఓ, ఐసీ... అయితే యివ్వాళ కాలేజీలో ఏదో జరిగిందన్నమాట. అవునా?....చెప్పు రమా! ఏమైందీ?"

చెప్పాను. అంతా విని దీర్ఘాలోచనలో మునిగి పోయాడు వాసు.

"వాసూ!" అన్నాను మెల్లిగా. తలెత్తి చూశాడు. "ఏఁవిటాలోచిస్తున్నావ్?"

"నీ గురించే.... నేనేం చెయ్యాలా అని...."

"నేను చెప్పనా!.... నువ్వేం చెయ్యకు, ఆలోచన్లు పెట్టుకోకు, రాయకు.... ఇక్కడే, ఇంట్లోనే వుండిపో, నాకు మంచి భర్తగా, నా పిల్లలకు తండ్రిగా...."

"అంటే.... అంటే మనిషిగా చచ్చిపొమ్మంటావు."

"వాసూ! ఏమిటా మాటలు!"

"అంతే రమా! దాని అర్థం అదే.... ఉహుఁ, నే నెలాగూ చావటానికి సిద్ధంగా లేను. కాని రమా! నీకూ, నీ పిల్లలకూ యే హానీ కలగకుండా మీ జీవితంలోంచి తొలగిపోవటానికి...."

నేను గాభరాగా, "వాసూ! నన్ను.... నన్ను వదలిపోతావా?" అంటూ వాసును పెనవేసుకున్నాను. "వొద్దు వాసూ! వొద్దు. అలా అనకు. నేను నిన్ను వదల్ను, ఎన్నటికీ వదల్ను. ఏమైపోయినా సరే వదల్ను" అంటూ యింకా గట్టిగా కావలించుకొన్నాను. వాసు కూడా నన్ను హత్తుకొని వీపు నిమురుతున్నాడు. నాలో ఒక్కసారి ఉద్రేకం పొంగుకొచ్చింది. వాసు మొహంనిండా ముద్దులు పెడుతూ మత్తుగా చూశాను. అంతే, వాసు నిగ్రహం కట్టలు తెగింది. అంతటి మధురానుభూతి యెన్నాళ్ళకెన్నాళ్ళకోగాని కలుగలేదు.... అలసి సొలసి నిద్రలోకి జారుకున్నాం. నాకు మెలకువ వచ్చేసరికి వాసు పక్కలో లేడు. ఇంట్లో ఎక్కడా లేడు.

నిజంగానే వెళ్ళిపోయాడేమోనని భయం వేసింది. కాని మూడు రోజుల తర్వాత వచ్చాడు.

## 20

మా జీవితం ఒక మలుపు తిరిగింది. వాసు మారలేదు, ఇక మారడని తేలిపోయింది. కాని రాను రాను నేనే మారుతూ వచ్చాను. నా సహనం క్షీణిస్తూ వచ్చింది. మొదట్లో పిల్లలమీద విసుక్కునే దాన్ని. తర్వాత్తర్వాత వాసుపైనే విసిరేదాన్ని సూటి పోటీగా. దానికి స్నేహితురాళ్ళ ఎగతాళి మాటలూ, ఇరుగు పొరుగు వారి దెప్పులూ దోహదమయ్యేయి.

ఒకరోజు నేను కాలేజీనించి యింటికొచ్చేసరికి రవి పడుకుని

న్నాడు. వొళ్ళు వెచ్చగా వుంది. నాకు తోచిన టేబ్లెట్స్ యేవో వేసి పాలు తాగించి పడుకోబెట్టాను. లక్ష్మికి ఆ రోజు శెలవు. వాసు రెండురోజుల్నించి యింట్లో లేడు. రాత్రయ్యేసరికి జ్వరం తగ్గకపోగా బాగా హెచ్చింది. నాకు దిగులు పట్టుకుంది. ఏం చెయ్యాలో తోచ లేదు. రజని, తమ్ముడిదగ్గిర కూచుని కునికిపాట్లు పడుతూ, పడుతూ నిద్రలో ఒరిగిపోయింది. దాన్ని తీసికెళ్ళి దాని మంచంమీద పడుకో బెట్టాను.

నేను వొంటరిగా కూచుని బాబు నొసట తడిగుడ్డ వేస్తూ జ్వరం తగ్గుతుందేమోనని చూస్తున్నాను. బాబు ఆరాటంతో మూలుగు మొద లెట్టేసరికి నాకు గబరాపుట్టి, పక్కింటికి పరుగెత్తి పిన్నిగార్ని పిలుచు కొచ్చాను. ఆమె వచ్చీ రావటంతోనే తన మామూలు ధోరణిలో అందుకుంది, "మీ ఆయన లేడా?....అవున్లే, ఆయనెందుకుంటాడూ, ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో ఏమిటో? ప్చ్! నీ ఖర్మ! ఇంత మంచిదానివి, నీకు ఆ దరిద్రుడే దొరకాలీ?....అయ్యో! అయ్యో! పిల్లవాడి వొళ్ళు కాలిపోతోంది. యింతవరకు యేం చేస్తున్నావ్? డాక్టర్ని పిలవొద్దూ?"

"నా దగ్గిరున్న మందులు వేశాను పిన్నిగారూ! తగ్గిపోతుం దనుకున్నాను."

"బాగానే వుంది నీ వైద్యం! వెళ్ళు వెళ్ళు, ఇప్పుడైనా పిలుచుకురా. నే నుంటాలే."

"ఇంత పొద్దుపోయింది, వస్తాడా?" నా అనుమాన్ని వెలి బుచ్చాను.

"ఎలాగైనా పట్టుకురావాలి, లేపోకతే, చూస్తూ చూస్తూ నీ కొడుకు...."

ఇక విన్లేదు. పరుగు తీశాను, ఆ వీధిలోనే వున్న డాక్టరు యింటికి. నిద్రపోతున్నట్టున్నారు. కాల్ బెల్ యెన్నోసార్లు నొక్కాక తలుపు తెరుచుకొంది. కళ్ళు నులుపుకుంటూ, "ఎవరూ?" అన్నాడు.

నా గోడు చెప్పుకుని, వెంటనే రమ్మని బ్రతిమాలాను. ఫీసు

ఎంతైనా యిస్తానన్నాను. ఆయన లోపలి కెళ్ళి అయిదు నిమిషాల తర్వాత చెస్టూ, స్టెతస్కోపుతో బయలుదేరాడు.

బాబును పరీక్షచేసి ఒక ఇంజక్షన్ వేసి, తన దగ్గిరున్న ఏవో టేబ్లెట్స్ యిచ్చి, ఫీజు యివ్వబోతే తర్వాత తీసుకుంటా లెమ్మని, తెల్లవారాక మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

పిన్నిగారు గొణుగుతూనే వుంది. నాకూ వాసుమీద అమితంగా కోపంగానే వుంది. కాని పిన్నిగారి మాటలు భరించలేక పోతున్నాను. "పిన్నిగారూ! బాబుకు నిద్ర పట్టినట్టుంది. మీరిక వెళ్ళిరండీ!" అన్నాను.

"అదేమిటే అమ్మాయి! వొంటరిగా వుంటావా? మీ ఆయన కూడా లేడాయె. పిల్లవాడి కింకా జ్వరం తగ్గనేలేదు....ఫరవాలేదులే, యీ రాత్రి కిక్కడే నీకు తోడుగా పడుకుంటాను" అంది.

వొంటరిగా వుండాలంటే నాకూ భయంగానే వుంది. ప్రక్క గదిలో పక్కవేసి, ఆమెని తీసుకెళ్ళి పడుకోబెట్టాను. కొన్ని క్షణాల్లోనే ఆమె గుర్రుపెడుతూ నిద్రపోయింది. ఆ గురకే నాకు ధైర్యాన్నిస్తోంది. అలాగే జాగరణ చేస్తూ బాబు ప్రక్కనే కూచున్నాను.

ఎప్పుడు కునుకుపట్టిందో తెలీదు. తెల్లవారుఝామున తలుపు చప్పుడుకు మెలుకు వొచ్చింది. బాబు నిద్రపోతున్నాడు; వొళ్ళు అంత వేడిగా లేదు.

వెళ్ళి తలుపు తెరిచాను; వాసు. నేను మాట్లాడకుండా ఇంట్లో కొచ్చేశాను. వాసు యిటు యింట్లోకి అడుగుపెట్టటమూ, అటు పిన్నిగారు లోపల్నించి రావటం ఒకేసారి జరిగింది. వెంటనే అందుకుంది, "ఇప్పుడొచ్చావా నాయనా? యేం మగవాడివయ్యా! రాత్రంతా నీ కొడుకు జ్వరంతో వొళ్ళు తెలియకుండా పడివుంటే, ఆ అమ్మాయి ఒక్కర్తే యింటా బయటా సతమతమవుతోంటే, నువ్వేమో, పూలరంగడిలా వూళ్ళేలుతున్నావా?...."

వాసు మొహం కళావిహీనమైపోయింది. గబగబా గదిలోకి దారి తీశాడు. పిన్నిగారు యింకా అంటూనే వుంది, "అంత మాత్రానికి పెళ్ళెందుకు చేసుకున్నావ్? పిల్ల లెందుకూ?...."

ఇహ వూరుకుంటే ఏం గొడవ జరుగుతుందోనని నేనే కల్పించుకున్నాను, "వూరుకోండి పిన్నిగారూ! ఆయన వరసే అంత. మీరు హైరానా పడకండి. పదండి, పాపం. రాత్రంతా మీకు నిద్ర వుండి వుండదు. మీకు చాలా శ్రమ యిచ్చాను, క్షమించాలి.... పదండి, పదండి" అంటూ లాక్కెళ్లి వాళ్లింట్లో దిగబెట్టి తిరిగివచ్చి తలుపు గడియవేశాను.

వాసు బాబు ప్రక్కన కూర్చుని వున్నాడు, వాడి మొహం లోకి దిగాలుగా చూస్తూ. నేను బాత్‌రూంలోకి వెళ్ళిపోయాను. మొహం కడుక్కుని, కాఫీ చేసి, ఒక కప్పులో కాఫీ తెచ్చి వాసు ప్రక్కన పెట్టాను. వాసు నా దిక్కు తిరిగి అడిగాడు "ఏం రమా! ఎప్పట్నించీ వీడి కీ జ్వరం?"

నేను జవాబు చెప్పకుండానే యింట్లోకి వెళ్ళిపోయాను. అప్పుడే వొచ్చిన లక్ష్మికి పనులు పురమాయిస్తూ వంటకు ఉపక్ర మించాను. వాసు అక్కడే కూచుని వున్నాడు.

ఎనిమిదిన్నరకు డాక్టర్ రొచ్చాడు. బాబును పరీక్షించి "ఫరవా లేదు, కోలుకుంటున్నాడు. కాని నాలుగేసి గంటలకు టెంపరేచర్ రికార్డ్ చెయ్యండి. ఈ మాత్రలు కూడా వాడండి. సాయంత్రం క్లినిక్కొచ్చి యే సంగతీ చెప్పండి" అంటూ యేవో రాసిచ్చి, వెళ్ళి పోయాడు.

ఆ జ్వరం అంతటితో వదల్లేదు. పారా టైఫాయిడ్ కిందికి దిగింది. వారంరోజులపాటు వాడిని సతాయించింది. అన్ని రోజులూ వాసు వాడి ప్రక్కనే వున్నాడు. నన్ను కాలేజీకి శలవు పెట్టనివ్వలేదు. అన్ని పనులూ, లక్ష్మి సహాయంతో తానే చేసుకుపోతున్నాడు. అయినా నేను ముభావంగానే వుండిపోయాను. "ఊఁ, ఆఁ"లు తప్ప జవాబు లిచ్చేదాన్ని కాదు. ఈ లోపున పిన్నిగారూ, మరో ఒకరిద్దరు యిరుగు పొరుగు అమ్మలక్కలు పిల్లవాడి గురించి పరామర్శించ టానికని వచ్చి, వాసును సూటి పోటిగా నాలుగు అంటించి వెళ్ళే వాళ్ళు. అయినా వాసు నిర్లిప్తంగానే వుండిపోయేవాడు. పదిరోజుల్లో రవి పూర్తిగా కోలుకున్నాడు.

# 21

అ తర్వాత కూడా వాసు చాలామట్టుకు యింటిపట్టునే వుంటు న్నాడు. నాకు చాలా సంతోషంగా వుంది. వాసు నిజంగానే మారి పోయినాడేమో అన్న భ్రమ కూడా కలిగింది. కాని యెంతోకాలం నిలవలేదు. మరో మార్పు వొచ్చింది. వాసు స్నేహితులు మా యింటికే రావటం మొదలెట్టారు. ముందు గదిలో కూచుని గంటలు గంటలుగా యేవేవో చర్చించుకునేవారు. ఒకర్నొకరు పేర్లతోగాక 'కామ్రేడ్' అంటూ సంబోధించుకొనేవారు. అదంతా నాకు అగమ్య గోచరంగా వుండేది. అయినా నా కెందుకు లెమ్మని వాటి గురించి పట్టించుకునేదాన్ని కాను.

కాని ఒకరోజు రాత్రి భోజనాలై పడుకున్నాక, ఎవరో తలుపు తట్టారు. వాసు వెళ్ళి తలుపు తీశాడు. 'కామ్రేడ్' అంటే 'కామ్రేడ్' అని పలకరించుకుని మాటలు మొదలెట్టారు. కాని మాటలు పైకి వినిపించటంలేదు; యేదో రహస్యం మాట్లాడుతూన్నట్లు గుస గుసలు మాట్లాడుతున్నారు. నాకు అనుమానం వేసింది. తిన్నగా వెళ్ళి తలుపు చాటున నిలుచుని విన్నాను. మాటలు స్పష్టంగా వినపట్టం లేదు. కాని శ్రీకాకుళం, సత్యం అనే పదాలు చెవికి సోకగానే నేను మరీ శ్రద్ధగా విన్నాను. గంగాధర్ అనే యువకుని వెంట పోలీసులు పడ్డారట. అతణ్ని కొన్నాళ్ళపాటు పోలీసుల బారినుండి కాపాడే బాధ్యత వాసుపైన వేస్తున్నారు. వాసు వెనకాడుతున్నాడు.

నేను గభాలున తలుపు తెరుచుకొని వెళ్ళి వాళ్ళ మధ్య కూచు న్నాను. అందరూ చకితులై నాకేసి చూస్తున్నారు. వాసుకు యేమీ పాలుపోలేదు. విధిలేక నన్ను పరిచయం చేశాడు, "నా భార్య రమా దేవి, గవర్నమెంటు కాలేజీలో లెక్చరర్."

తక్కిన ముగ్గురూ నమస్కారం చేశారు. నేను ప్రతి నమ స్కారం చేసి, వాళ్ళని కూడా పరిచయం చెయ్యమని అడిగాను. అందరూ ఒకరి మొహాలు వొకరు చూసుకుంటూ నిశ్శబ్దంగా వుండి పోయారు.

"....పోనీ లెండి, పరిచయాలు చెయ్యదలుచుకోకపోతే

మానె, మీ చర్చలు కానివ్వండి, మానేశారేం?" అన్నాను.

వాళ్ళంతా వాసును ప్రశ్నార్థకంగా చూశారు. వాసు తల వంచేసుకున్నాడు.

వారిలో ఒకడన్నాడు "అబ్బే, ఏం లేదండీ, మా పార్టీగొడవ లేవో మాట్లాడుకుంటున్నాము."

"అవే కానివ్వండి అంటున్నాను."

"కాని....మీరు....మీరు....మా పార్టీ సభ్యులు కారుగా...."

"అంటే, రహస్యాలన్న మాట....చూడండి మిస్టర్! మీ పార్టీ యేమిటో, మీ రెవరో నాకు తెలీదు. కాని యీ యింట్లో నాకు తెలియని విషయాలు మాట్లాడుకోటానికి వీల్లేదు."

"వాసుగారు...."

"వాసు నా భర్త, నిజమే. కాని యిది నా యిల్లు అని మర్చిపోకండి....ఇహ మీరంతా దయ చెయ్యొచ్చు" అని లేచాను.

వాళ్ళంతా మళ్ళీ వాసుకేసి చూస్తున్నారు. వాసు దించిన తల యెత్తకపోయేసరికి, ఒక్కొక్కరే లేచి వెళ్ళిపోయారు. నేను తలుపు గడియవేసి మళ్ళీ కూచున్నాను.

వాసు తలెత్తి, "నన్నిలా అవమానపర్చటం సబబుగా వుందా రమా?" అన్నాడు.

"మరి నాకు మాత్రం అవమానం కాదా?"

"నీకా?"

"కాదా?....ఆ రహస్యాలేమిటో నాతో యెందుకు చెప్పరూ....?"

వాసు కళ్ళల్లో తళుక్కున ఒక మెరుపు మెరిసింది. ఆశ పొడసూపింది. ఉత్సాహంతో అన్నాడు, "చెబుతాం, తప్పకుండా చెబుతాం, కాని రమా! నువ్వు....నువ్వు కూడా మా పార్టీలో చేరుతావా?"

"అది ఎన్నటికి జరగని విషయం. పైగా, నా ప్రయత్నమల్లా నిన్ను కూడా ఆ వలయంలోంచి బయటి లాగటమే...."

వాసు మొహం వాడిపోయింది.

"అది అసంభవం" అన్నాడు గంభీరంగా.

"అయితే విన్నిక దేవుడే రక్షించాలి."

"హుం, దేవుడిమీద నాకు నమ్మకం లేదని నీకు బాగా తెలుసు."

"అది ఆత్మవంచన....వాసూ! నువ్వెంతటి ప్రమాదస్థితిలోకి దిగజారిపోతున్నావో గ్రహించలేకుండా వున్నావు....ఆ గంగాధరం ఎవడోగాని...."

"రమా!."

"నా కంతా తెలుసు, అంతా విన్నాను. దాచటానికి ప్రయత్నించకు. కాని ఒక్కటి మాత్రం తధ్యం. వాడిని రక్షించటానికి ప్రయత్నించావో నువ్వు కూడా పట్టుబడక పోవు. నీతోబాటు మా...."

"అదే నేనూ ఆలోచిస్తున్నాను."

"ఏమిటి?"

"....నావల్ల నీకే ఆపదా రాకుండా నేను శాశ్వతంగా...."

"ఆ మాట యిదివరకు కూడా అన్నావు. బెదిరింపా?"

"కాదు. ఈసారి కృతనిశ్చయంతో అంటున్నాను."

నా గుండె నిండా దైన్యం నిండుకుంది. తీవ్రంగా ఆలోచిస్తూ కూచున్నాను. మరో పరిష్కార మార్గమే తోచలేదు. చివరికో నిట్టూర్పు విడిచి అన్నాను, "సరే, జారుడు కాళ్ళకు ఎన్నాళ్ళని బంధాలు వెయ్యగలను....కాని ఒక్క కోరిక."

ఏమిటన్నట్లు చూశాడు వాసు.

"....నీకు తెలుసు, నే నిప్పుడు ఉత్తమనిషిని కాను, ఏదో నెల. బాబో, పాపో పుట్టేవరకు ఓపికపట్టు. ఆ తర్వాత నీ యిష్టం" అని గదిలోకి వెళ్ళిపోయాను.

## 22

ఆ తర్వాత మళ్ళీ ఎవరూ మా ఇంటికి రాలేదు. వాసే తరుచూ వెళ్ళి వస్తూండేవాడు. నేనేమీ అడక్కపోయేదాన్ని. మా ఇద్దరి మధ్య దాదాపు మాటలే లేకుండా పోయాయి. అలాంటి గంభీర వాతావరణం

లోనే మా మూడోపిల్ల చిట్టి పుట్టింది. ఎవరికీ ఉత్సాహంగా లేదు. ఏ వేడుకలూ చెయ్యలేదు.

ఎవరి పనుల్లోవాళ్ళం మునిగి వుండేవాళ్ళం. ముఖాముఖి వాదోపవాదాలు జరగలేదు. వెళ్ళిపోతానన్నమాట వాసు మళ్ళీ అన లేదు. నేనూ యెత్తలేదు. వాసు సిగరెట్లు తాగటం మరీ యెక్కువై పోయింది. దగ్గుకూడా ఎక్కువైంది. అయినా నేను పట్టించుకోలేదు. బరువు గుండెల్తోనే రోజులు గడుస్తున్నాయి.

చిట్టికి మూడు నెలలప్పుడు దీపావళి పండగొచ్చింది. ఎక్క డెక్కడో తిరిగి ఆ క్రితంరోజే ఇల్లు చేరుకున్నాడు వాసు. నాకు పట్ట రాని సంతోషం కలిగింది. చేదు గతాన్ని మరిచిపోయి, నా పాత వాసుని అక్కున చేర్చుకుందామనీ, పండగ బ్రహ్మాండంగా జరిపిద్దా మనీ ఉవ్విళ్ళూరాను. కాని నా అహం అడ్డొచ్చింది. వాసు తనకై తాను ఒక్కమాట, కేవలం ఒక్కమాట మాటాడితే చాలు గొల్లున ఏడ్చేసి కాళ్ళమీద పడిపోయే పరిస్థితికొచ్చాను. కాని వాసు భయం భయంగా, బెదురు బెదురుగా, దూరదూరంగానే వుంటూ వచ్చాడు. ఆ దినమల్లా యెన్నోసార్లు దగ్గరికొచ్చాడు, మాట్లాడించబోయాడు, కాని మాట్లాడలేదు.

రాత్రికి ఏడు గంటలప్పుడు నేను ఇంట్లో ఏదో పని చూసు కుంటూన్నప్పుడు రజని వొచ్చి అంది, "అమ్మా! నాన్న పది రూపాయ లిమ్మంటున్నాడే" అని. దాంతో నా కోపం తారాజువ్వలా ఉవ్వెత్తున లేచింది. ఛీ! ఏం మనిషి! ఆడదాని సంపాదనమీద బ్రతకటమే కాకుండా తన ఖర్చులకూ్కడా చెయ్యి చాచే హీనస్థితికి దిగజారి పొయ్యాడు.

"అమ్మా! డబ్బు" అంటోంది అమ్మాయి.

"ఛీ! పోవే, మీ నాన్ననే సంపాదించుకోమను. ఇక్కడేం తేరగా రాలేదు" అని పెద్దగా అరిచాను. ఆ అరుపుకు జడిసి బిక్క మొహం వేసుకుని వెళ్ళిపోయింది అమ్మాయి.

కాసేపటికి నా కోపమంతా బుస్సున చల్లారిపోయింది. ఛీ ఛీ, పాడు పది రూపాయలకోసం పండుగ పూట యెంత మాట అనేశాను

అన్న పశ్చాత్తాపంతో కుంగిపోయి, పర్సులోంచి పది రూపాయలు తీసుకుని గబగబా బయటికెళ్లాను. కాని అక్కడ వాసు లేడు. పిల్లలు మాత్రం అరుగుమీద కూచుని వున్నారు.

"మీ నాన్నేరే?"

"వెళ్ళిపోయారుగా...."

గుండె ఝల్లుమంది. "వెళ్ళిపోయారా? ఎక్కడికి?"

"డబ్బు సంపాదించీ, టపాకాయలు కొనుక్కురావటానికి."

నాకు అర్థం కాలేదు. "టపాకాయలా? టపాకాయలేంవిటే?"

"అవునమ్మా! వీడు పొద్దట్నించీ నాన్నను సతాయిస్తున్నాడమ్మా, టపాకాయలు కొనివ్వమని. డబ్బు లేదంటే కూడా వినటం లేదు. పోనీ అమ్మదగ్గిర పదిరూపాయలు తీసుకురమ్మని నన్ను పంపించారమ్మా! కాని నువ్వేమో...."

నేనింక వినే స్థితిలో లేను. అయ్యో! అయ్యో! ఎంత పొరపాటు జరిగింది! డబ్బు తన కోసం కాదన్నమాట, పిల్లలకోసమన్నమాట. ఎంత అభిమానాన్ని చంపుకొని అడిగాడో? నేను పాపిష్టిదాన్ని. ఎంత మనసు నొప్పించానో? ఎటు వెళ్ళాడో ఏమో?... నా కాళ్ళు వణకడం ఆరంభించాయి. అక్కడే గుమ్మంలోనే చతికిలబడ్డాను, వీధిలోకి చూస్తూ.

నిజంగానే యెక్కడైనా డబ్బు పుట్టించి టపాకాయలు కొనుక్కుని వస్తాడేమోనన్న ఆశకొద్దీ, కళ్లార్పకుండా నిరీక్షిస్తూ కూచున్నాను. రాత్రల్లా కూచునే వున్నాను. కాని వాసు రాలేదు.

## 23

ఆ రోజే కాదు మరో నెలరోజులదాకా కనిపించలేదు వాసు.

ఒకరోజు అర్ధరాత్రి తలుపు తట్టుతూ, 'రమాదేవిగారూ!.... రమాదేవిగారూ!....' అంటున్నారు యెవరో. నాకు మెలుకువొచ్చింది. లక్ష్మిని లేపాను.

"ఎవరూ?....ఎవరదీ?" అన్నాను.

"తలుపు తియ్యండమ్మా, వాసుగారిని తీసుకొచ్చాం"

గుండె గుభేలుమంది. వెంటనే తలుపు తీశాను. ఇంటిముందో

పెద్ద కారు నిలబడి వుంది.

"ఇది వాసుగారి ఇల్లేకదండీ?" అని అడుగుతూన్నారు ఎవరో అపరిచిత వ్యక్తి.

"అవును, ఏం? మీరెవరూ?" అన్నాను అనుమానంగా.

నాకు జవాబివ్వకుండానే, "రారా" అని డ్రైవర్ని పిలిచి, కారు తలుపుతీసి, ఇద్దరూ కలిపి వాసుని పట్టుకుని దించారు. వాసు వాళ్ళమీద వొరిగిపోతున్నాడు.

"ఏమైంది? వాసుకేమైంది?" అన్నాను ఆదుర్దాగా.

"ఏం కాలేదండీ, మీరు కంగారుపడకండి. కాస్త తప్పుకోండి" అంటూ లోపలికి తీసుకొచ్చారు. "ఎక్కడ పడుకోబెట్టమంటారు?" అంటున్నాడు.

నాకు కోపం ముంచుకొచ్చింది. "ఏమైందో చెప్పమంటూంటే" అన్నాను విసుగ్గా.

"ఏం కాలేదండీ, బాగానే వున్నారు....ఏదో కాస్త డోసు."

"ఆఁ? తాగాడా?" అన్నాను విస్మయంగా.

"ఎక్కువేం కాదులెండి....ఆఁ, ఈ గదిలోకి తీసుకెళ్దాం...."

"ఆగండి" అరిచాను. "లోపలి కెళ్ళొద్దు. అక్కడే కూచోబెట్టండి"

"ఇక్కడా?....బండలమీదా?"

"ఆఁ, అక్కడే."

"సరే, మీ ఇష్టం....ఊఁ, పట్టరా, మెల్లిగా....ఆఁ, అట్లా.... కూచోటం లేదే....పోనీ, పడుకోబెడ్దాం....ఊఁ, మెల్లిగా...."

"ఎవరు మీరు?"

"నేను....నేనేమో డ్రైవర్నండి. ఈరేమో...."

"ఒరేయ్, అదంతా యెందుకూ? పద, పోదాం....తలుపేసుకోండి" అంటూ ఇద్దరూ బయటికి నడిచారు.

కారు స్టార్టయి వెళ్ళిపోయింది. నేను వెనక్కు తిరిగాను. వాసు చుట్టచుట్టుకుని పడివున్నాడు.

దగ్గరికెళ్ళి, "వాసూ!....వాసూ!" అని పిలిచాను. కదల్లేదు.

పలకలేదు. బాగా కుదిపాను. చలనం కలిగింది. కళ్ళు తెరవకుండానే అంటున్నాడు "....ఊఁ... ఆఁ....ఎవరు?....ఎవరు మీరు?....ఓ రాణీ గారా?....వొద్దండీ, వొద్దు....ఇక తాగలేను....మా ఆవిడకి తెలిస్తే."

రాణి?....ఈ రాణి ఎవరు? ఎవరో వెన్నుపోటు పొడిచినట్టు అయింది.

"వాసూ!....వాసూ!....కళ్లు తెరువు" గట్టిగా అరిచాను.

"వొద్దండీ....నన్ను పడుకోనివ్వండీ....హాయిగా వుంది...."

"వాసూ! కళ్లు తెరువు.... ఇటు చూడు. నేను....నేను రమని."

"ఆఁ? రమ....రమా?" కళ్ళు తెరిచాడు. "రమా!....నువ్వు యిక్కడా?....వొద్దు....వెళ్ళు....వెళ్ళు రమా!" మళ్ళీ కళ్లు మూతలు పడుతున్నాయి.

ఇక లాభం లేదని వెళ్ళి గ్లాసెడు నీళ్లు తెచ్చి మొహానికి కొట్టాను. గాబరాగా లేచి కూచున్నాడు. "అరెరే, ఇదేమిటి?.... వర్షమా?....వొద్దొద్దు, అలా నీళ్లు కొట్టకు....అబ్బా....ఎంత చలిగా వుంది...."

టవల్ తెచ్చాను. "ఇదిగో టవల్. తుడుచుకో....మత్తు వదిలిందా?"

"మత్తా?....నాకా?"

"కాదు, నాకు" అన్నాను కసిగా.

మెల్లి మెల్లిగా తెలివి కొస్తూ, "రమా!....రమా! నన్ను క్షమించు....క్షమించవూ?" అంటున్నాడు దీనంగా.

నేను వాసు ముందర కూచున్నాను. "చెప్పు, ఆ రాణి ఎవరో చెప్పు."

"రాణీ?....రాణి ఎవరు?....ఓ, రాణీగారా?"

"ఆఁ ఆఁ అదే, రాణీగారు!! నీకు తాగుడు పోసిందే, అది" అన్నాను వెటకారంగా.

"వొద్దు రమా!....వొద్దు. ఆమెని అలా అనొద్దు....ఆమె గొప్పది....చాలా గొప్పది....కవిత్వమంటే ఎంత అభిమానం!....

అందులో నా కవిత్వమంటే...."

"పడి చస్తుంది!....అందుకే నిన్నిలా పాడు చేస్తోంది."

"కాదు రమా!....ఆమె యేం చెయ్యలేదు. నేను.... నేనే...."

నాకు దుఃఖం ముంచుకొచ్చింది. రుద్ధకంఠంతో అన్నాను, "వాసూ!....వాసూ! ఎందుకిలా తయారయ్యావు? ఎందుకు నా కల లన్నీ వమ్ము చేశావు? యెందుకు నాకీ శిక్ష? నేనేం పాపం చేశాను?...."

"పాపమా?....నువ్వా?....అవును....అవును రమా! నువ్వు పాపమే చేశావు. ఒకే ఒక్క పాపం....అదే....నన్ను....ఎందుకూ పనికిరాని నన్ను....కోరి కోరి పెళ్ళి చేసుకున్నావు."

"వాసూ!"

"అవును రమా! అదే నువ్వు చేసిన పొరపాటు, కాదు, పాపం....నువ్వెంత నరకయాతన పడుతున్నావో నాకు తెలుసు రమా! తెలుసు....కాని....కాని....ఏం చెయ్యను? నేనేం చెయ్యను రమా?...."

నేనేం మాట్లాడకుండా వెక్కి వెక్కి ఏడుస్తున్నాను.

"ఏడుస్తున్నావా రమా?....వొద్దు రమా! వొద్దు. నువ్వేడ వొద్దు. నువ్వు సంతోషంగా వుండాలి. నా కంతే చాలు" అంటూ లేవబోయాడు.

నేను పట్టుకుని ఆపాను. "వాసూ! లేవకు పడిపోతావు."

"ఫరవాలేదు రమా!....నాకు బాగానే వుంది. నన్ను లేవనీ...."

"ఎక్కడికి?"

"ఎక్కడికో తెలీదు... కాని వెళ్ళాలి....అసలివాళ ఇక్కడికి రావాలనే అనుకోలేదు."

"పద, లోపలి కెళ్దాం, పద" అంటూ చేయూత నిచ్చాను. లేపబోయి పడిపోయాడు. మళ్ళీ మత్తులోకి జారిపోయాడు. లేపటం నా చేతకాలేదు. ఒక చాప, దిండూ తెప్పించి, పరిచి, అక్కడ సహా

యంతో వాసును ప్రక్కకు తొలగించి, పడుకోబెట్టి, బ్లాంకెట్ కప్పాను. లక్ష్మిని వెళ్లి పడుకోమని చెప్పి, నేనక్కడే చతికిల బడ్డాను....

వాసు గాఢ నిద్రలో వున్నాడు. నేను లేచి, వెళ్ళి గదిలో పడుకున్నాను. కాని ఆలోచనల ముసురులో చాలాసేపు నిద్ర పట్ట లేదు. ఎప్పుడు కునుకు పట్టిందో తెలీదు. లేచేసరికి పొద్దుపోయింది. వెంటనే ముందు గదిలోకెళ్ళి చూశాను; వాసు లేడు. తలుపు గడియ తీసి వుంది. ఇల్లంతా వెతికాను. ఎక్కడా లేడు. లక్ష్మి ఇంకా నిద్ర లేవలేదు.

గుండె బరువెక్కింది. వెళ్ళి చిట్టిని ఎదకు అదుముకుని పడు కున్నాను, లోలోనే దుఃఖిస్తూ.

## 24

ఈసారి నాకు మరీ దిగులుగా వుంది. వాసు యిక నాకు దక్కడేమో అన్న విచారం పట్టుకుంది. ఒకవేపు ఆరోగ్యం దిన దినానికి క్షీణిస్తూన్నట్టు స్పష్టమవుతూనే వుంది. దానికి తోడు తాగుడు కూడా అలవాటైనట్టుంది. పైగా అదెపతో రాణి అట, దాని సహవాసం ఒకటి. మరోవేపు రాజకీయాలు. ఎలాంటి చిక్కుల్లో ఎంతవరకు చిక్కుకుని వున్నాడో తెలీకుండా వుంది.

ఇన్నాళ్ళూ మొండిగా, ధైర్యంగా నిలదొక్కుకుని నిలబడ గలిగాను. అంతా నాలో నేనే దిగమ్రింగుకుని, ఎవరితోనూ ఏమీ చెప్పలేదు. అమ్మా నాన్నలతోగాని, తమ్ముడు రాంబాబుతోగాని, ఆఖరికి నా ప్రాణస్నేహితురాలు లీలతోగాని ఏమీ చెప్పలేదు. కాని ఇక ధైర్యమాగటంలేదు. ఎవరితోనో ఒకరితోనైనా నా గోడు వెళ్ళ బోసుకుంటేనేగాని నాకు మనశ్శాంతి కలిగేట్టు లేదు. కాని ఎవరికి ఏం చెప్పాలో తోచక సతమతమవుతూ వున్నాను. అలాచే అయిదు రోజులు గడిచిపోయాయి.

ఆరో రోజు, ఇక ఆగలేక, నాన్నగారింటికి ఫోన్ చేశాను. తమ్ముడు రామం రిసీవరెత్తాడు.

"రామం! నేను రమని రా"

"ఓ, అక్కా! నువ్వా!....ఏంవిటి విశేషాలు? అమ్మని పిలవనా?"

"వొద్దు, వొద్దు. నీకే చేశాను....ఇంకా కాలేజీ కెళ్ళలేదా?" వాడు ఇంజనీరింగ్ చదువుతున్నాడు.

"ఇప్పుడే బయలుదేరుతున్నాను."

"సరే, సాయంత్రం ఓ మాటు వస్తావా? .... నీతో మాట్లాడాలి."

"ఏంవిటి సంగతి?"

"చెబుతాగా, నువ్వు రా!"

"పిల్లలు కులాసాయేనా?"

"ఆ, అంతా కులాసాయే. వస్తావు కదూ?"

"ఆ!"

"తప్పక రావాలి, మరచిపోకు....ఆఁ, అమ్మకూ నాన్నకూ చెప్పకేం!"

"ఏం, ఎందుకనీ?"

"చెబుతాగా, నువ్వు రా!" ఫోన్ పెట్టేశాను.

ఆ రోజు కాలేజీకి వెళ్ళలేదు. దినమల్లా ఆలోచిస్తూ కూచున్నాను, రామం వస్తే ఏమేం చెప్పాలో, ఎలా చెప్పాలో.

సాయంత్రం అయిదింటికి కాల్ బెల్ మోగింది. వెంటనే వెళ్ళి తలుపు తీశాను. రామం, కాదు, ఎవరో అపరిచిత వ్యక్తి.

"ఎవరు? ఎవరు మీరు?"

"ఇది వాసుదేవరావుగారి ఇల్లే కదూ?" అని యెదురు ప్రశ్న వేశాడు. అవునన్నట్లు తలూపాను.

"మీరు వారి భార్య రమాదేవిగారు కదూ?" అని రెండో ప్రశ్న వేశాడు.

"అవును, ఏం?"

"నన్ను కాస్త లోనికి రానివ్వండి. మీతో కొంచం మాట్లాడాలి."

"వాసుగారు ఇంట్లో లేరు."

"అది తెలుసు. మీతోనే మాట్లాడాలి."

"నాతోనా?....అసలు మీరెవరు? ఎందుకొచ్చారు?" కొంత ధైర్యం పుంజుకుని అడిగాను.

అతను మాట్లాడకుండా జేబులోంచి తన ఐడెంటిటీ కార్డు నా చేతికిచ్చాడు. సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ రాజశేఖర్ అని వుంది. నాకు ముచ్చెమట్లు క్రమ్మాయి. భయం భయంగా అతనికేసి చూశాను.

"భయపడకండి సిస్టర్! నేను ఒకటి రెండు ప్రశ్నలు మాత్రం వేసి వెళ్ళిపోతాను" అన్నాడు.

నేను ప్రక్కకు తొలిగాను. అతను లోపలికొచ్చి కూర్చున్నాడు. నన్నూ కూచోమని సౌజ్ఞ చేశాడు. ఎదురుగా మరో కుర్చీలో కూర్చున్నాను.

అతను నోరు కదపక మునుపే, నేను ఆదుర్దాగా అడిగాను, "చెప్పండి, వాసు యెలా వున్నాడు? ఎక్కడ వున్నాడు?"

అతను చిరునవ్వు నవ్వాడు. "ప్రశ్నలు వేసేది నేను, మీరు కాదు....అదే ప్రశ్న మిమ్మల్నడుగుతున్నాను, చెప్పండి, మీ భర్త వాసు ఇప్పుడెక్కడున్నారు?"

"ఇదేం వేళాకోళం? నాకు తెలిస్తే మిమ్మల్ని యెందు కడుగుతాను?" అన్నాను కొంచం విసుగుతో.

"మీరు నిజంగా అమాయకులో, లేక గడుసువారో ఇంకా తేల్చుకోలేకుండా వున్నాను. ఏది ఏమైనా, మీరు మాత్రం మీ భర్త గురించి మీకు తెలిసినంతమట్టుకు అన్ని విషయాలూ, ఏదీ దాచకండా చెప్పి తీరాలి, తప్పదు."

"చెబుతాను, అంతా చెబుతాను. నా దగ్గిర దాపరికాలు వుండవు. కాని ముందు నా ప్రశ్నకు సమాధానం మీరు చెప్పాలి, అప్పుడేకాని నేను చెప్పను."

"ఏమిటి?"

"వాసు ఇప్పుడు సురక్షితంగా వున్నాడా?....ఎక్కడున్నాడు?"

అతను ఆలోచనలో పడ్డాడు. ఆఖరికి అన్నాడు "సరే, చెబుతాను....మాకు తెలిసినంత మట్టుకు వాసు సురక్షితంగానే వున్నాడు.

కాని ఎక్కడున్నాడో తెలీదు."

హమ్మయ్య! మనసు కుదుటపడ్డది. పోలీసు కస్టడీలో మాత్రం లేడన్నమాట, "ఇక అడగండి" అన్నాను, తమ్ముడు రాంబాబు వస్తున్నాడేమోనని ఒకసారి వీధిలోకి చూసి.

"అడిగానుగా? మీకు తెలిసిందంతా చెప్పాలి"

"ఏముందీ, వాసు నా భర్త. మేము ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం. మాకు ముగ్గురు పిల్లలు. నేను గవర్నమెంటు కాలేజీలో లెక్చరర్ని. వాసు యెక్కడా ఉద్యోగం చెయ్యడు. కొన్నాళ్ళపాటు జర్నలిస్టుగా పనిచేశాడు. ఇప్పుడు కేవలం కవిత్వం రాస్తుంటాడు అంతే" అని వూర్కున్నాను.

"అది యెలాంటి కవిత్వమో చెప్పగలరా?"

"క్షమించాలి, నేను సైంటిస్టుని, సాహిత్యంతో నాకంత పరిచయం లేదు."

అతను నన్ను అదోలా చూసి అన్నాడు, "రమాదేవిగారూ మీరు, మొదట్లో నేను అనుకున్నంత అమాయకులు కారల్లే వుంది కాని ఒక్కటి, పోలీసులతో అబద్ధాలాడటం పులితో చెలగాటం అన్న మాట మరిచిపోకండి."

"మీరేమంటున్నారో నాకు అర్థంకావటం లేదు. మీతోనేకాదు నేనెవరితోనూ అబద్ధాలాడను."

"పోనీలెండి, ఇది చెప్పండి. వాసు కోసం అతని స్నేహితులెవరైనా ఇంటికొచ్చేవారా?"

"పూర్వం వచ్చేవారు, ఆరు నెలలనించి మానేశారు."

"ఎందుకనీ?"

ఆనాడు జరిగిన విషయం అంతా చెప్పాను, ఒక్క గంగాధరం మాట తప్పించి.

"అయితే ఆనాడు వాళ్ళు మాట్లాడుకున్న విషయాలు ప్రమాదకరమైన రాజకీయాలని తెలుసన్నమాట."

"తెలీదు. వాళ్ళేదో రహస్యాలు మాట్లాడుకున్నారు. నాకు చెప్పటానికి నిరాకరించారు."

"వాళ్ళ ముగ్గురి పేర్లు తెలుసా?"
"తెలీదు. వాళ్ళు చెప్పలేదు. నేను అడగలేదు."
"పోనీ, ఎలా వుంటారో చెప్పగలరా?"
"ఒకడు యెత్తుగా, లావుగా, నలభై యాభై మధ్య వయస్కుడు. తక్కిన ఇద్దరు కుర్రవాళ్లు. కాలేజీ స్టూడెంట్స్‌లాగున్నారు."
"చూస్తే పోల్చుకోగలరా?"
"ఏమో, చెప్పలేను. రాత్రిపూట రెండుమూడు నిముషాలు మాత్రమే చూశాను."
అతను జేబులోంచి కొన్ని ఫొటోలు తీసి నాకు అందించాడు. ఒక్కొక్కటే చూశాను.
"ఉహూఁ, వీళ్ళెవరూ కారనుకుంటాను."
ఫొటోలో తిరిగి తీసుకుంటూ అన్నాడు, "మీరు యెప్పుడైనా రాణీగారిని చూశారా?"
"రాణీగారా?....లేదు, చూళ్ళేదు. కాని అయిదురోజుల క్రితం ఆఖరిసారి వాసు ఇంటి కొచ్చినప్పుడు, ఆవిడ పేరే కలవరించాడు" అంటూ ఆ సంఘటనంతా చెప్పుకొచ్చాను.
ఆఖరికి అతను లేస్తూ, "చాలా థాంక్స్ రమాదేవిగారూ! నాకు చాలా ట్రబులిచ్చాను. అయితే ఒక్క విషయం. మీరూ, నేనూ కూడా ప్రభుత్వోద్యోగులం. ప్రభుత్వానికి యెదురు తిరిగే దేశద్రోహులను పట్టించే బాధ్యత మనిద్దరిమీదా వుంది...."
"అంటే....వాసు....వాసు దేశద్రోహి....?"
"కాదు, కాదు. నేనలా అన్లేదు. కాని అతను, కొన్ని ప్రమాదకరమైన దుష్టశక్తులతో స్నేహాలు చేస్తున్నాడు. అతణ్ణి వాటి బారినుండి కాపాడే బాధ్యత కూడా మనమీదే వుంది....అదిగో, నా కార్డు మీ చేతిలోనే వుంది, వుండనివ్వండి. అందులో నా టెలిఫోన్ నంబర్ వుంది. వాసుగానీ, అతనికోసం అతని స్నేహితులుగానీ ఇంటికి వచ్చినా, ఎక్కడైనా కనిపించినా, లేక ఫోన్‌చేసినా, మీరు వెంటనే నాకు తెలియజెయ్యాలి. అది మీ కనీస కర్తవ్యం. మరిచిపోకండీ, వస్తా" అంటూ వెళ్ళిపోయాడు.

# 25

ఆ కార్డు అలానే పట్టుకుని శూన్యంలోకి చూస్తూ కూచున్నాను. అలా యెంతసేపు కూచున్నానో తెలీదు.

"అక్కా! అక్కా!" అన్న పిలుపుతో తేరుకున్నాను. రాంబాబును చూడగానే దుఃఖం కట్టలు తెగింది. వాడిని వాటేసుకుని భోరున ఏడ్చేశాను. వాడు కంగారుపడిపోయాడు.

"ఏఁవిటి, ఏఁవిటక్కా! ఏమైందీ?" అని అడుగుతున్నాడు. చాలాసేపటికిగాని నేను కోలుకోలేదు. కళ్లు తుడుచుకుని, వీధి తలుపు గడియవేసి వచ్చి కూచున్నాను.

రాంబాబుతో మొదట్నించీ, ఒక్కొక్క విషయం నా కథంత చెప్పుకొచ్చాను. ఆఖరికి అంతకు క్రితమే వచ్చివెళ్ళిన సి.ఐ.డీ సంగతిగూడా చెప్పాను.

అంతా విని రాంబాబు అన్నాడు, "ఎంత పని చేశావక్కా ఇన్నాళ్ళూ ఇంత చిచ్చు నీ గుండెల్లో దాచుకుని మాతో ఒక్క ముక్కయినా చెప్పకుండా, నీలో నువ్వే మధనపడ్డావా?....సరే అయిందేదో అయిపోయింది. ఈ నాటికైనా నాతో చెప్పావు. చాలు ఇక నువ్వు నిశ్చింతగా వుండు. ఈ విషయమేమిటో నేను కనుక్కుంటాను. అలాంటి రాజకీయ ముఠాలు కొన్ని వున్నాయనీ, మా కాలే స్టూడెంట్సుకూడా కొందరు అందులో వున్నారనీ నాకు తెలుసు కొందరు రచయితలూ, కవులు వాళ్ళకి దోహదపడుతూంటార తెలుసు. కాని బావకూడా వాళ్ళతో చేతులు కలుపుతున్నాడని తెలీదు నాక్కొంచం గడువివ్వు. బావ ఎంతవరకు వాళ్ళతో కలిసిపోయాడో ఏఁవిటో ఆరా తీస్తాను....ఆఁ, ఈ లోపున నా మాట విని, ఇ ఇక్కడ వొంటరిగా వుండకు. ఇంటికొచ్చేయి."

"ఉహూఁ, నేను రాను, రాలేను."

"ఇంకా పంతమేనా?"

"పంతంకాదు. నేను ఇక్కడ వుంటేనే వాసు ఏనాటికైనా నన్ను వెతుక్కుంటూ వస్తాడు. అక్కడ వుంటే అస్సలు రాడు."

"....పోనీ, నేనొచ్చి ఇక్కడ వుండనా?"

"వొద్దు వొద్దు. అలా అయితేకూడా అతను రాకపోవచ్చు....
వాసుకు నేనంటే ప్రాణం.కాని తన నమ్మకాల మీద మరీ మోజెక్కువ.
ఈ రెంటి మధ్య నలిగిపోతున్నాడు. నేనిక్కడ వొంటరిగా తనకోసం
వేచి వున్నానంటేనే అప్పుడప్పుడైనా వస్తాడు. నేను నావాళ్ళ దగ్గిర
సురక్షితంగా వున్నానని తెలిస్తే నిశ్చింతగా తనదారిన వెళ్ళిపోతాడు.

"నీ వూహలు విచిత్రంగా వున్నాయక్కా!....సరేలే, అలాగే
కానీ. పోనీ, నేను రోజూ వచ్చి కనుక్కుంటుంటాను. దానికీ
అభ్యంతరమా?"

"రోజూ అక్కర్లేదు. ఇప్పటిలాగే పనిపిల్లతో మేనేజ్ చేసుకో
గల్ను. నువ్వు వారానికోమాటు వస్తే చాలు. ఈలోగా అవసరమైతే
ఫోన్‌చేసి పిలిపిస్తాను....ఆఁ, అమ్మకూ నాన్నకూ చెప్పకు. అనవస
రంగా బాధ పడిపోయి, నన్నిక్కడ్నించి బలవంతాన లాక్కెళ్ళినా
లాక్కెళ్తారు. అది నా కిష్టంలేదు."

"సరేలే....ఏదీ, ఆ కార్డిలా ఇవ్వు, ఈ విషయం ఏదైనా
తెలిశాక వచ్చి చెబుతాను. అంతవరకు నువ్వు నిర్భయంగా, నిశ్చింతగా
వుండు....ఆఁ, చిట్టి ఏదీ?" అంటూ లోపలికి దారితీశాడు.

## 26

వారం రోజుల తర్వాత రాంబాబు పిడుగులాంటి వార్త మోసు
కొచ్చాడు. ఏదో కుట్రకేసులో వాసునుకూడా దోషిగా నిర్ణయించారట.
అరెస్టు వారెంట్‌కూడా జారీచేశారట. అది వినగానే నా కాళ్లు చేతులు
చల్లబడ్డాయి. వున్నపళంగా కూలబడ్డాను. రాంబాబు నన్ను ఓదారుస్తు
న్నాడు, ఇంకా ప్రమాదమేమీ జరగలేదనీ, తక్కిన వారితోబాటు
వాసుకూడా పరారైనాడనీ,ఎక్కడో అజ్ఞాతంగా వుంటున్నాడనీ, ఇంత
వరకు పట్టుబడలేదనీ, బహుశ పట్టుబడక పోవచ్చనీ....

"హుఁ, నీ భ్రమగాని రామం! ఎన్నాళ్ళని పోలీసులను తప్పిం
చుకు తిరగ్గలడు?"

"అలా ఏళ్ళతరబడి తిరుగుతూన్నవారు కూడా వున్నారట
అక్కా!"

"నీకిదంతా ఎలా తెలిసిందిరా? ఇన్స్పెక్టర్ శేఖర్‌ని

కలిశావా?''

"నీ పిచ్చిగాని అక్కా! అతను చెబుతాడా? అతనేగా వేటాడు తోంది.''

"మరీ?''

"....మరో మంచి ఆధారం దొరికిందిలే.''

"ఎవర్రా?''

"ఊహుఁ, చెప్పను....చెప్పకూడదు, అతి రహస్యం. ఆ రహస్యాన్ని నేను కాపాడకపోతే ఆ ఆధారం కూడా పోయి మనం అంధకారంలోనే వుండిపోతాం. సమయం వచ్చినప్పుడు చెబుతాలే.... ఆఁ, అన్నట్టు నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి. నీ ఇంటిమీద కన్నువేసి వుంది పోలీసు. ఇక్కడికొచ్చి పోయే వాళ్ళందర్నీ గమని స్తున్నారు. బహుశ నీ టెలిఫోన్‌కూడా ట్రేస్‌చేస్తూ వుంటారు. నాతో మాట్లాడినప్పుడు కూడా జాగ్రత్తగా వుండు. బావగనక యెప్పుడైనా ఫోన్‌చేస్తే, మాట్లాడకు, వెంటనే పెట్టేయ్. నన్నడిగితే ఫోన్ సరెం డర్ చేసేస్తే మంచిది.''

"వొద్దు. ఫోన్ సరెండర్ చేస్తే, నిన్ను పిలవాలిసొస్తే యెలా?....కాని రామం! ఎన్నాళ్లు? .... ఎన్నాళ్ళురా ఇలా? దీనికి పరిష్కార మార్గం లేదా?''

"ఎందుకు లేదు. బావగనక తనకై తాను పోలీసులకి పట్టుబడి పోతే ఏమంత పెద్ద శిక్ష పడకపోవచ్చు. కాని కాదని ఎదిరిస్తే ఏమవు తుందో చెప్పలేము.''

"అంతేనంటావా?....నాకు భయంగా వుందిరా....''

"భయపడి ఏం లాభం? విండా మునిగాక చలేమిటి?.... ధైర్యంగా వుండాలి. గత్యంతరంలేదు.''

## 27

ఆ రోజునుంచి దినమొక గండంలా గడుస్తున్నది. రోజూ పేపర్లో నక్సలైట్ల గురించి వార్తలకోసం వెతుకుతూ శ్రద్ధగా చదివే దాన్ని. అప్పుడప్పుడు యెక్కడో దోపిడీలు జరిగినట్టూ, దాడులు జరిగి నట్టూ, కాల్పులు జరిగినట్టూ కొందరు చనిపోయినట్టూ వార్తలు

పడేవి. అవి చదవగానే నా గుండె ఆగిపోయేది. వెంటనే రాంబాబుని పిలిపించి అడిగేదాన్ని. వాడు వాకబుచేసి వాటిలో వాసు లేడని హామీ ఇచ్చేదాకా ఏడుస్తూ కూచునేదాన్ని ...అలా ఆర్నెల్లు గడిచాయి.

ఒకరోజు పోస్టులో నా పేరిట ఒక పుస్తకం వచ్చింది. తీసి చూశాను, "అరుణ రేఖలు", గేయసంపుటి, కర్త: 'ఖడ్గతిక్కన', అంకితం: 'సుషుప్తావస్థలో వున్న ప్రజానీకానికి'. రెండో పేజీమీద 'నా ప్రియమైన రమకు—వాసు' అని, ముద్దులుగొలిపే అక్షరాల్లో రాసి వుంది. అది చూడగానే నా మనస్సు పొంగిపోయింది. ముద్దు పెట్టుకుని హృదయానికి హత్తుకున్నాను. ఒక్కొక్క గేయమే చదువుతోంటే వాసు నా యెదుట కూచుని చదువుతూన్నట్టే ఫీలయాను.

రాంబాబుని పిలిపించి చూపాను.

"గుడ్! బావ సురక్షితంగానే వున్నాడన్నమాట....ఏదీ, దాని పోస్టు కవరేదీ?" అన్నాడు.

"అదెందుకూ?"

"అది ముఖ్యం. ఇలాతే."

అక్కడే పడివుంది. తీసిచ్చాను. తేరిపార పరిశీలించి, "కలకత్తా నించి పోస్టు చేశారు. బాగానే జాగర్త పడుతూన్నారన్న మాట....అక్కా! వెంటనే నువ్వు రాజశేఖర్‌గారికి ఫోన్‌చేసి చెప్పెయ్."

"అదేవిటి?"

"అవును. ఇది ఇదివరకే పోలీసుల చేతుల్లో పడివుంటుంది. నిన్ను టెస్టు చెయ్యటానికి దీన్ని నీదాకా రానిచ్చి వుంటారు. నీకై నువ్వే తెలియజేస్తే నీమీద అనుమానం కలగదు."

నాకు కోపం వచ్చింది. "అంటే, చూస్తూ చూస్తూ వాసుకు ద్రోహం తలపెట్టనా?"

"ఇందులో ద్రోహమేమీ లేదు. ఈ పుస్తకాన్ని నీ కొక్కదానికే కాదు. మరెందరికో కూడా పంపించి వుంటారు. కేవలం పోస్టు ముద్రలద్వారానే పట్టుబడగలిగితే దాన్ని యెవరూ తప్పించలేరు. నా మాట విను అక్కా! నేను నీ శ్రేయస్సుకోరే చెబుతున్నాను. అతనికి

చెప్పేయ్" అంటూ బ్రతిమాలుకున్నాడు.

నాకు ఇష్టం లేకున్నా రాంబాబును కాదనలేక, ఫోన్ చేసి పుస్తకం సంగతి చెప్పాను.

"ఇప్పుడే వస్తున్నాను. రేపర్ జాగ్రత్తగా పెట్టండి...." అన్నాడు.

రాంబాబు వెళ్ళిపోయాడు. అరగంటలో అత నొచ్చాడు. పుస్తకం, రాపర్ రెండూ ఇచ్చాను.

"గుడ్! మీ మాట నిలబెట్టుకున్నారు... ఇకమీదట పుస్తకమే కాదు, ఉత్తరాలు వచ్చినా కూడా, కవర్లతోసహా నాకు చూపెట్టాలి, తెలిసిందా?"

అలాగేనని తలూపాను. రాపర్‌తో సహా పుస్తకాన్ని జేబులో పెట్టుకున్నాడు. తెరిచైనా చూళ్ళేదు.

"ఇన్‌స్పెక్టర్‌గారూ! మీకు కావలసింది రేపర్‌కదా, దాన్ని తీసికెళ్ళండి. పుస్తకం యిచ్చెయ్యండి. అది నా భర్త కానుక" అని వేడుకున్నాను.

"తెలుసు" తెలుసా? అంటే ఇదివరకే చూశాడన్నమాట! రాంబాబు అనుమానం నిజమేనన్నమాట! కొందరు పోలీసులు ఎంత మందబుద్ధులో అర్థమైంది. "కాని యివ్వటానికి వీల్లేదు. ప్రభుత్వం ఈ పుస్తకాన్ని నిషేధించింది. ఇది మీ దగ్గరుండటం నేరం. మిమ్మల్ని అరెస్టు చెయ్యాల్సి వుంటుంది" అన్నాడు.

నేను మారు మాట్లాడలేదు.

"సరే, వస్తా.... నా మాటలు జ్ఞాపకమున్నాయిగా, తు.చ. తప్పకుండా పాటించాలి," అంటూ వెళ్ళిపోయాడు.

మరో మూడు నెలలకి మరో పుస్తకమొచ్చింది. పేరు: 'ప్రళయతాండవం'. కావ్యసంకలనం. అంకితం:'అరుణోదయానికి'. అన్నీ మారు పేర్లతోనే రాయబడి వున్నాయి. 'ఖడ్గతిక్కన'ఎక్కడా కనిపించలేదు. మరో పేరు పెట్టుకున్నాడేమో—రెండు మూడు గేయాలు చదువుతోంటే నా వొళ్ళు జలదరించింది. బహుశ అవి వాసు రాసినవేనేమో—ఇదివరకులాగే రెండో పేజీమీద 'నా హృదయరాణి

రమకు—వాసు' అని రాసి వుంది.

ఈసారి రాంబాబుతో సంప్రతించకుండానే, నేనే ఫోన్ చేసి రాజశేఖర్‌ని పిలిపించి, రాపరూ పుస్తకం అప్పజెప్పాను. అందు కుంటూ అడిగాడు, "ఉత్తరాలేం రాలేదా?"

"రాలేదు."

"సరే....మీ పుస్తకాల్ని జాగ్రత్తగా అట్టే పెడుతూన్నాను, వీలైనప్పుడు మీవి మీకు ఇచ్చేస్తాలెండి."

"థాంక్స్!"

వెళ్ళిపోయాడు.

## 28

ఆ తర్వాత మరే పుస్తకమూ రాలేదు. దీపావళి వచ్చింది. అప్పటికి వాసును చూసి దాదాపు సంవత్సరమవుతున్నది. వాసుకోసం నా హృదయం పరితపించిపోతున్నది. ఒక్కసారి, ఇంకొక్కసారి కనిపిస్తే చాలు, ఏమైతే అవుతుందని నా ప్రేమపాశంలో బంధించి వాసును నా జీవితంలోంచి మరెన్నడూ జారిపోకుండా శాశ్వతంగా నా వాణ్ణి చేసుకోవాలని వందసార్లు సంకల్పించుకున్నాను. ఒక్కసారి రప్పించమని వేయి దేవుళ్ళకు మొక్కుకున్నాను.

నా నోము ఫలించింది. వాసు వొచ్చాడు, సరిగ్గా దీపావళినాటి రాత్రికి. కాని....కాని నేనేం చేశాను? ఆ రాజశేఖర్ రాక్షసుడికి జడిసి భయానికి లొంగిపోయి పిచ్చి ప్రవర్తనతో వాసును....నా మనసును వాకిట్లోంచే తరిమివేశాను.

ఇంతేనా? ఇక నా జీవితమంతా యింతేనా? ఈ వెలుగునీడల్లో కొట్టుమిట్టాడుతూ, జీవితాంతం వరకూ వెలుతురు కోసం వెతుక్కుంటూ వెళ్ళబుచ్చాల్సిందేనా? నిష్కృతి లేదా?

దీపావళి ఉధృతంగా సాగుతోంది. బాంబులు ప్రేలుతున్నాయి, చిచ్చుబుడ్లు చివ్వుమంటున్నాయి, కాకరవత్తులు వెలుగుతున్నాయి. ఎక్కడో కాదు, నాలోనే. కాని అవేవీ నా హృదయాంతర్భాగాల్లో నిండివున్న అంధకారాన్ని ఛేదించలేకపోతున్నాయి. అంతటా వెలుతురు, నాలోనే చీకటి....అంతా చీకటి!

రెండో రోజు రాంబాబును పిలిపించి చెప్పాను ఎలాగైనా వెతికి ఒక్కసారి, కేవలం ఒక్కసారి వాసును నా దగ్గరికి తీసుకు రమ్మని బ్రతిమాలాను.

"అక్కా! నువ్వేమంటున్నావో నీకు అర్ధమవుతోందా? బావ యిక్కడికి రావటం పోలీసు బోనులోకి రావటమేనని మరచిపోతున్నావా?" అన్నాడు.

"ఏమైనా సరే, ఫరవాలేదు. ఒక్కసారి కలుసుకోవాలి. వాసుకు బదలు నేను జైలుకెళ్తాను."

"అది నీ పిచ్చి అనీ, అలా జరగటానికి వీల్లేదనీ నీకూ తెలుసు....అయినా సరే, అలాగే ప్రయత్నిస్తాలే" అంటూ వెళ్ళిపోయాడు. మళ్ళీ పదిరోజుల తర్వాత వచ్చి వాసు ఎక్కడా కనిపించ లేదనీ, అసలు యీ పట్నంలోనే లేడనే చెప్పాడు. ఎందుకో వాడి మాటలు నమ్మ బుద్ధికాలేదు. వాసు ఇక్కడే యీ వూళ్ళోనే వున్నాడని నా అంతరాత్మ ఘోషిస్తోంది.

## 29

నా అనుమానం నిజమైందేనని ఆ మరుసటి రోజే తేలిపోయింది.

సాయంత్రం కాలేజీనించివచ్చి, స్నానం చేసి బట్టలు మార్చుకుని, కాఫీ తాగి ముందు గదిలో కూచున్నాను, చిట్టిని యెత్తుకొని. పెద్దపిల్లలిద్దరూ ఆవరణలో ఆడుకొంటున్నారు. పనిపిల్ల వంటింట్లో కూరలు తరుగుతోంది.

ఇంతలోకి ఇంటిముందు పోలీసువాను ఆగింది. నా గుండె దడ హెచ్చింది. అందులోంచి రాజశేఖర్ దిగాడు.

లోపలికొచ్చాడు. లేచి, కుర్చీ చూపించాను. కూచున్నాడు. నేనూ కూచున్నాను, అనుమానంగా అతని మొహంలోకి చూస్తూ. జేబులోంచి ఒక చిన్న బిస్కట్ పొట్లం తీసి చిట్టి కందించాడు.

"థాంక్స్!" అన్నాను.

"రమాదేవిగారూ! ఎలా వున్నారు?" అన్నాడు, అతి ఆప్యాయంగా.

"....ఉన్నాను, యిలా జీవచ్ఛవంలా" అన్నాను గిండెల దాకా తట్టుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

"ప్చ్! మిమ్మల్నీ, మీ పిల్లల్నీ చూస్తోంటే నా గుండె తరుక్కు-పోతోంది."

నేను ఆశ్చర్యంగా చూశాను.

"మీరు....మీకు మా మీద జాలా?....అయితే మీరు పోలీసు ఉద్యోగంలో...."

"అదే పొరబాటు. పోలీసులు కూడా మనుషులే! మాకూ మనసులుంటాయి....పెళ్ళాం పిల్లలుంటారు, ప్రేమలూ ఆపేక్షలూ వుంటాయి. ఎటొచ్చీ, వుద్యోగరీత్యా 'విధులుంటాయి. వాటిని నిర్వర్తించక తప్పదు. దాన్ని మీరు అపార్థం చేసుకుంటారు."

నేను మాట్లాడలేదు.

కొంచెం ఆగి, నెమ్మదిగా అన్నాడు, "ఏమ్మా! మీకు వాసుని చూడాలని వుందా?"

నేను త్రుళ్ళిపడ్డాను.

"వాసా?....ఎక్క-డ, ఎక్క-డున్నాడు?"

"....మీకు చూడాలని వుందా?"

"ఎందుకుండదూ? ఇన్నాళ్ళూ దానికోసమేగా కాచుకూ-చు న్నాను?....కాని ఎక్క-డ? ఎక్క-డున్నాడు?"

"....మా దగ్గిరే!"

"మైగాడ్! అయితే....అయితే....పట్టుబడి పోయాడన్న మాట?...."

"ఏం? మీరు చెప్పనంత మాత్రాన మాకు చిక్క-కుండా పోతా డనుకున్నారా?"

"నేనా?....చెప్పకమా?....ఏమిటి మీరంటున్నది?"

"ఆ నాడు .... దీపావళి రాత్రి వాసు యిక్క-డికి రాలేదూ?...."

ఓ, అంతా తెలిసిపోయిందన్నమాట.

"....వచ్చాడు. కాని అతను వాసు అవునో కాదో తేల్చుకోక

మునుపే వెళ్లిపోయాడు. వాసే అయితే వస్తాడు, తప్పకుండా వస్తా డని యిప్పటిదాకా యెదురు చూస్తూనే వున్నాను. వస్తే తప్పకుండా తెలియజేసేదాన్నే."

"నిజంగానా?"

"నేను అబద్ధాలాడటం లేదు. మా తమ్ముడు రాంబాబుతో కూడా అన్నాను వాసు యిక్కడే వుంటే యెలాగైనా ఒక్కసారి యింటికి పిలుచుకురమ్మని. మళ్ళీ యెక్కడికి వెళ్ళకుండా బంధించి వేస్తానని. వాడు యెక్కడా కనిపించలేదని చెప్పాడు....ఇది నిజం, ఇదిగో ఈ చిట్టిమీద ప్రమాణం చేసి...."

"అహఁహ, అంతంత ప్రమాణాలు అక్కర్లేదు....సరే, చూపిస్తాను. కాని ఒక షరతు."

"షరతా?"

"కాదు ప్రార్థన. మాకు సహాయపడాలి."

"ఎలా?"

"చూడండి రమగారూ! వాసును మీరు బాగా యెరుగుదురు. [...]త్త ఆవేశపరుడు. అసలు ఈ రచయితలంతా ఇంతేనేమో! ఏవేవో పుస్తకాలు చదువుతారు, ఏవేవో వూహించుకుంటారు. ఆ బావాలన్నీ రాతల్లో వెళ్ళగ్రక్కుతారు. అంతవరకు ఫరవాలేదు. ఆ రాతల్ని మేము అరికట్టేయగలం. కాని అంతటితో ఆగక అసలు విద్రోహాలతో ప్రత్యక్ష సంబంధం పెట్టుకుంటారు. వీళ్ళకేమీ చేతకాకపోయినా వాళ్ళకేదో సహాయం చేద్దామన్న వుబలాటం కొద్దీ యేవేవో పిచ్చిపన్లు చేస్తూంటారు."

"వాసు అలా చేస్తున్నాడా?"

"చేసినా చెయ్యకపోయినా వాళ్ళతో సంబంధం మాత్రం వుంది. అది మీకూ తెలుసు. మీ యింటికొచ్చే అతని స్నేహితుల్లో కొందరు అలాంటి ఆరితేరిన విద్రోహులేనని రూఢి అయింది. అదే వొప్పుకోటంలేదు వాసు. వారం రోజులనించి అడుగుతున్నా చెప్పటం లేదు....చూడండమ్మా! మీ సంసారం యొక్క శ్రేయస్సూ, మీ పిల్లల భవిష్యత్తు దృష్ట్యా అడుగుతున్నాను, వాసు మాతో కొంత

సహకరించేట్టు చూడాలి మీరు."

"సహకారమా?....అంటే?"

"ఏంలేదు. వాళ్ళు, ఆ విద్రోహుల ఆచూకీ తెలియజెయ్యాలి, అంతే-ఆ తర్వాత వాసుకు ఏ శిక్ష పడకుండా, ఏ హానీ కలగకుండా, సురక్షితంగా మీకు అప్పజెప్పే భారం నాది."

"అయితే పదండి, ఇప్పుడే వస్తాను. వచ్చి వాసు కాళ్ళమీద పడి వేడుకుంటాను. నాకోసం, నా పిల్లల కోసం చెప్పెయ్యమంటాను, అంతా చెప్పెయ్యమంటాను...."

"గుడ్!....కాని యిప్పుడు కాదు, రేపు....రేపు ప్రొద్దున పద కొండు గంటలకి క్రయింబ్రాంచ్ ఆఫీసుకు రావాలి. ఎక్కడుందో తెలుసు కదూ? మీ కోసం మేము చూస్తుంటాము. తప్పకుండా రావాలి....ఆఁ, ఒక మాట, ఈ విషయం యెవరికీ తెలియొద్దు. అందుకే పోలీసు వేన్నుగానీ, పోలీసు జవాన్నుగానీ పంపించటం లేదు. మీ తమ్ముడికూడా చెప్పొద్దు."

సరేనని తలూపాను. వెళ్ళిపోయాడు.

## 30

రెండోరోజు ప్రొద్దున్నే మా హెడ్ ఆఫ్ ది డిపార్ట్మెంట్కి ఫోనుచేసి చెప్పాను, నాకు వొంట్లో సుస్తీగా వుంది, కాలేజీకి రాలే నని. వంటచేసి, పిల్లల్ని స్కూలుకు పంపించి, చిట్టిని పనిపిల్ల కప్ప గించి బయలుదేరాను.

సరిగ్గా పదకొండు గంటలకి క్రయింబ్రాంచికి చేరుకున్నాను. నా కోసమే యెదురుచూస్తున్నారేమో, ఒక జవాను అడిగాడు రాజ శేఖర్గారి కోసమానని. అవునన్నాను. నన్ను లోపనికి తీసుకెళ్ళాడు. ముందు గది ఆఫీసులో వున్నాదేమో, రాజశేఖర్, నన్ను చూడగానే బయటికొచ్చాడు.

"గుడ్! మాట ప్రకారం వచ్చారు. పదండి" అంటూ నన్ను మరో గదిలోకి తీసికెళ్ళాడు.

అక్కడో పెద్ద ఆఫీసరు కూచుని వున్నాడు. యాభై ఏళ్ళుం టాయేమో. రాజశేఖర్ సెల్యూట్ చేసి, నన్ను పరిచయం చేశాడు.

ఆయన మందహాసం చేసి నన్ను కూచోమన్నాడు. కూచున్నాను.

"ఏమ్మా! బావున్నావా?....మీ నాన్నగారు నాకు తెలుసు" అన్నాడు. నా గుండె గుభేలుమంది. "నీకు జ్ఞాపకం లేదేమో, మీ పెళ్లి రిసెప్షన్‌కి కూడా వచ్చాను.

"అయితే...అయితే....చెప్పారా....?" అన్నాను సంకోచిస్తూ.

"ఎవరికి? మీ నాన్నగారికా?" పెద్దగా నవ్వాడు. "లేదు లేదు. అలా అందరికీ చెప్పే విషయం కాదిది....అనవసరంగా మీ ఆయన మొండికెత్తున్నాడు. అది సడలించటంలో నువ్వు ప్రభుత్వానికి సహాయం చెయ్యాలి. శేఖర్ అంతా చెప్పి వుంటాడుగా?"

అవునన్నట్లు తలూపాను.

ఇక వెళ్ళొచ్చన్నట్లు శేఖర్ వేపుకు చూశాడు. శేఖర్ మళ్ళీ సెల్యూట్ చేసి బయలుదేరాడు. నేను అనుసరించాను.

ఎన్నో గదులూ, కారిడార్లూ దాటి వెనుక భాగానికి వెళ్ళాము. అక్కడో గదిముందు ఇద్దరు సాయుధ జవాన్లు నిలబడి వున్నారు. గదికి తాళంవేసి వుంది. శేఖర్‌ని చూడగానే సెల్యూట్ చేశారు. ఒకడి బెల్టుకు తగిలించి వున్న తాళంచెవి తీసి, గది తాళం తీసి, ఒక రెక్క తెరిచాడు. నన్ను లోపలికెళ్ళమని సౌజ్ఞ చేశాడు రాజశేఖర్. సందేహిస్తూనే వెళ్ళాను. లోపలికి అడుగు పెట్టగానే వెనక తలుపు మూసుకుంది. అంతా చీకటిగా వుంది. కాని వెంటనే నూరు వాట్ల బల్బు వెలిగింది. నా కళ్ళు జిగేలుమన్నాయి.

గదంతా ఖాళీగా వుంది. ఒక మూలకు చిన్న స్టూలుమీద కూచుని వున్నాడు ఒక వ్యక్తి. తేరిపార చూశాను. సంస్కారంలేక గుబురుగా పెరిగిన జుత్తూ, గడ్డం, మాసిపోయి అక్కడక్కడ చిరుగులు చూపుతూన్న షర్టూ, ప్యాంటూ, బక్కచిక్కిన దేహం, లోతుకుపోయిన కళ్ళతో నా వేపే చూస్తున్నాడు వింతగా.

"వాసూ!" అంటూ అరుస్తూ ఒక్క పరుగున ముందుకెళ్ళాను. మెల్లిగా లేచి నన్ను కౌగిట్లోకి తీసుకున్నాడు. ఏడుస్తూ గట్టిగా కావలించుకున్నాను. వెన్నెముకలూ, ఛాతీ ఎముకలూ గుచ్చు

కుంటున్నాయి.

"ఏమిటి, ఏమిటీ వేషం వాసూ? ఎందుకిలా అయ్యావ్?" నేను విలపిస్తూనే అడుగుతున్నాను.

నా పట్టు కాస్త సడలించుకుని, నా ముఖంలోకి చూస్తూ అన్నాడు, "ఏడవకు రమా! ఏడవకు. నాకేం కాలేదు, బాగానే వున్నాను....కాని రమా! నీకు....నీ కెలా తెలుసు, నే నిక్కడున్నానని?"

"రాజశేఖర్‌గారు చెప్పారు. ఆయన చాలా మంచివారు. ఆయనే నన్నిక్కడికి పిలిపించారు...."

"ఓహో! అలాగా...." అతని వదనం గంభీరంగా మారిపోయింది.

నేను ఒక్కసారి కిందకు జారి వాసు కాళ్ళను పెనవేసుకుని, "వాసూ!....వాసూ! నా మాట విను. నా కోసం, నా పిల్లల కోసం, కాదు కాదు, మనకోసం వాళ్ళ మాట విను. చెప్పేయ్, అంతా చెప్పేయ్...." అని బ్రతిమాలాను.

నా భుజాలు పట్టుకుని లేవనెత్తి అన్నాడు, "లేలే,....ఏమిటి నీ పిచ్చి రమా? నేనేం చెప్పాలి?"

"అదే....వాళ్లు....విద్రోహులున్నారటగా .... వాళ్ళ ఆచూకీ చెప్పేయ్, అంతే. నిన్ను విడుదల చేసేస్తారు. నీకు ఏ శిక్ష వెయ్యరు. నాతో ఇంటికి వచ్చేస్తావు. మనం హాయిగా మునుపటిలా వుంటాము. నిన్ను....నిన్ను మళ్ళీ ఒక్క మాటా అనను, ఎన్నడూ అనను...."

"నువ్వెంత అమాయకురాలివి రమా! వాళ్ళెవరో, ఎక్కడుంటారో నాకు తెలిస్తే కదా చెప్పటానికి?"

"తెలీదా?" నేను నమ్మలేకుండా వున్నాను.

"తెలీదు. అదే నేను చెబుతోంటే ఈ పోలీసువాళ్లు నమ్మటం లేదు ...నేను కేవలం రచయితను, కవిని. అది అందరికీ తెలుసు. నేను ఏ విద్రోహుల్లోనూ పాల్గొనలేదు, నాకు ఏ విద్రోహులతోనూ పరిచయంలేదు."

"మరి....మరి, మనింటికి వచ్చేవారే?"

"మనింటికి చాలామంది వచ్చేవారు."

"కాదు, ఆ రోజు రాత్రికి ముగ్గురొచ్చారు. నేను కోపగించు కుంటే వెళ్లిపోయారు?"

"నువ్వు ఏ రాత్రి గురించి చెబుతున్నావో నాకు జ్ఞాపకంలేదు. రాత్రేమిటి, పగలేమిటి చాలామంది వచ్చేవారు. వాళ్ళంతా పత్రికల తోనూ, సాహిత్యంతోనూ సంబంధమున్నవాళ్ళు. విద్రోహు లెవ్వరూ కారు. మేము సాహిత్యం గురించీ, ప్రపంచ రాజకీయాల గురించీ చర్చించుకునేవాళ్ళం. నీకు ఈ రెండూ యిష్టముండేవి కావు. అందుకే విసుక్కునేదానివి. వాళ్ళు వెళ్ళిపోయేవాళ్లు."

"అంతేనంటావా!"

"ముమ్మాటికీ అంతే."

"మరి, మరి అదే వాళ్ళతో గట్టిగా చెప్పరాదూ?"

"చెబుతూనే వున్నాను. వాళ్ళు నమ్మటం లేదు, నేనేం చెయ్యను?...."

"అయితే....అయితే నీ కిక విడుదలే లేదా?"

"అది మన చేతుల్లో లేదు....కాని రమా! నువ్వు దిగులు పడకు. నన్ను వీళ్ళేం చెయ్యలేరు. నేను నిర్దోషిని. నా నిర్దోషి త్వమే నాకు ఆత్మబలా న్నిస్తోంది....ఆఁ, రమా! మన పిల్లలెలా వున్నారు?"

"బాగానే వున్నారు. యెప్పుడూ నిన్నే తలుచుకుం టూంటారు."

"హుఁ, నన్ను తలుచుకుంటారా? నేను వాళ్ళకేం చేశానని? ....అంతా నువ్వే....తల్లీ, తండ్రివి. వాళ్లు పెద్దవాళ్ళై, విజ్ఞానవంతు లైతే నాకంతే చాలు....రమా! వాళ్ళకి నన్ను జ్ఞాపకం చేయించకు, మరిపించు."

"వాసూ!"

"అవును రమా! అదే మంచిది."

ఇంతలోకి చటుక్కున తలుపు తెరుచుకుంది.

"రమగారూ! టైమై పోయింది. ఇక మీరు వచ్చేయండి"

గుమ్మంలో నిలుచుని రాజశేఖర్ అంటున్నాడు.

నాకు ఒక్కసారి దుఃఖం ముంచుకొచ్చింది. గభాలున వాసును పెనవేసుకున్నాను. ఇంక మళ్ళీ మేము కలుసుకుంటామో లేదో నన్న భయం వొక్కసారి నన్ను చుట్టుముట్టింది. గట్టిగా కావలించు కున్నాను. అదే భావం వాసు క్కూడా కలిగిందేమో. గట్టిగా పొదవి పట్టుకుని, పెదవులమీదా, బుగ్గలమీదా, మెడమీదా ముద్దులు పెట్టు కుంటూ, నా వొళ్ళంతా తడుముతూన్నాడు.

"ఊఁ, చాలించండి. ఇది పోలీసుస్టేషనని మరచిపోకండి, రండి" అంటూ గర్జించాడు.

నా పట్టు విడిపించుకుని, "వెళ్లు రమా! వెళ్లు, వాళ్ళకు అనవ సరంగా కోపం తెప్పించకు" అన్నాడు వాసు. విధిలేక విడిచిపెట్టి, వెక్కి వెక్కి ఏడుస్తూ వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ బయటి కొచ్చేశాను. గది తలుపులు మూసుకున్నాయి.

నేను ఇంకా ఏడుస్తూనే అప్రయత్నంగా రాజశేఖర్ చేతులు పట్టుకున్నాను. "అన్నగారూ? వాసు నిజమే చెబుతున్నాడండీ. అతని కేమీ తెలీదండీ, నమ్మండీ...." అంటూ వేడుకున్నాను.

"సరే సరే. ముందు మీరు యింటికెళ్ళండి" అంటూ నన్ను తీసుకెళ్ళి రెడీగా వున్న ఒక ఆటోలో కూచోబెట్టాడు. ఇంటికొచ్చే శాను దారంటా దుఃఖిస్తూనే. ఇంటికి రాగానే చిట్టిని హృదయానికి హత్తుకుని ఏడ్చాను. అలాగే మంచంమీద ఒరిగిపోయాను.

# 31

కొంచంసేపటికి ప్రక్కకి వత్తిగిల్లానేమో, నా వీపుకేదో గుచ్చుకున్నట్టనిపించింది. లేచి, వీపు తడుముకున్నాను. రవికలో ఏదో గుండ్రంగా తగిలింది. బయటికి లాగాను. కాగితపు చుట్ట! ఆశ్చర్యం వేసింది, అది అక్కడికెలా వెళ్ళిందా అని. గబగబా చుట్ట విప్పి చూశాను. ఏదేదో రాసి వుంది; ఒక మూలకు ఒక చిన్న స్కెచ్ కూడా వుంది. భాష తెలుగూ, ఇంగ్లీషూ కలగాపులగంగా వుంది. కాని ఏవేవో సాంకేతిక పదాలతో యేమీ అర్థం కాకుండా వుంది. రెండు మూను తడవలు చదివినా బోధపళ్ళేదు. తిప్పి చూశాను.

"దీన్ని వెంటనే పాండే వీధిలో 6-7-13 యింటిలో అందజేయాలి" అని తెలుగులో స్పష్టంగా రాసి వుంది.

నేను అలాగే దాన్ని చూస్తూ నిశ్చేష్టగా వుండిపోయాను. షాక్ తగిలినట్టు మెదడు పని చెయ్యటం మానుకుంది....వాసు.... అవును, అది వాసే రాశాడు, సందేహంలేదు. ఆ దస్తూరీ మరొకరిది కావటానికి వీల్లేదు....అయితే....అయితే, వాసు నాతో నిజం చెప్ప లేదన్నమాట! ఓరి, భగవంతుడా!! మెల్లిగా భయం ముంచుకొస్తోంది. దీని పర్యవసానమెలా వుంటుందో తలచుకోటానికి ధైర్య మాగటం లేదు. నా చేతిలోవున్న కాగితంపైన కన్నీటిబొట్లు పడేవరకు నాకు స్పృహ లేదు నేను యేడుస్తున్నానని. వెంటనే కళ్ళు తుడుచు కొన్నాను.

మళ్ళీ చదవటానికి, అర్థం చేసుకోటానికి యెంత గింజుకున్నా లాభంలేకపోయింది. దాన్ని ఏం చెయ్యాలో కూడా బోధపళ్ళేదు. చించి పారెయ్యాలా? అవును, పీడా వదులుతుంది. చింపటానికి వుప క్రమించాను. అంతలో చప్పున వాసు ముఖం నా కళ్ళెదుట నిలిచింది. ..సంగా, జాలిగొలిపే దృక్కుల్తో దన్ను ప్రార్థిస్తున్నట్టు చూస్తున్నాడు. నేను ఏడుస్తూ, పోలీసులకి లొంగిపొమ్మని అంత ప్రతిమాలుతూన్నా, నామీద నమ్మకంవుంచి ఈ కాగితాన్ని నా కందించాడా? నామీద అంత నమ్మకమా? ఆ నమ్మకాన్ని వమ్ము చెయ్యనా?....మనసు వొప్పు కోటంలేదు. యెటూ తోచక, ఆ కాగితాన్ని తీసికెళ్ళి అల్మరా సొరుగులో దాచి, తాళంవేసి వచ్చి పడుకున్నాను. ఆలోచనల్తో మెదడు దిమ్మెక్కిపోతోంది.

చిట్టి లేచి ఏడ్చేదాకా నాకు ధ్యాసేలేదు. లేచి దానికి అన్నం కలిపి తినిపించాను. లక్ష్మికి కూడా అన్నం పెట్టి, ఇంటికి పంపిం చాను. నాకు అన్నం సహించలేదు. చిట్టి నేలమీద బొమ్మలతో ఆడు కొంటోంది. నేను అలాగే మంచం మీద వొరిగాను. ఎప్పుడు నిద్ర పట్టిందో తెలీదు. కాల్ బెల్ మ్రోతకు మెలుకు వొచ్చింది. చిట్టి నేల మీద పడి నిద్రపోతోంది. దాన్ని మంచంమీద పడుకోబెట్టాను. సాయంత్రం మూడున్నరైంది. వెళ్ళి తలుపు తెరిచాను. ఎదుట

రాంబాబు.

"నిద్రపోతున్నావా అక్కా?" అంటూ లోపలికొచ్చాడు. తలుపు గడియవేసి, నేరుగా పడగ్గదిలో కెళ్ళాడు. నేనూ వెళ్లాను.

"పనిపిల్ల వుందా?" అని అడిగాడు.

"లేదు, ఇంటికెళ్ళింది. ఇంకో గంటకిగాని రాదు."

"మంచిదే, మనం మాట్లాడుకోవచ్చు....కూచో."

నా కేమీ అర్థం కాలేదు. వాడికేసే చూస్తూ కూచున్నాను.

నిద్రపోతూన్న చిట్టి తల నిమురుతూ అడిగాడు, "ఊం, చెప్పు....ప్రొద్దున పోలీస్‌స్టేషన్‌లో యేం జరిగిందో చెప్పు?"

"రామూ! నీకు....నీకు?...."

"నాకంతా తెలుసక్కా....! అక్కడేం జరిగిందో చెప్పు....!"

చెప్పాలా వొద్దా అని తటపటాయించాను. చెప్పొద్దని రాజశేఖర్ వార్నింగ్ యిచ్చాడు. కాని యింత జరిగాక కూడా, యేమీ చెప్పకుండా, అంతా నాలోనే దాచుకుంటే గుండె పగిలేట్టుగా వుంది....అంతా చెప్పేశాను, వొక్క ఆ కాగితం విషయం తప్ప.

"ఇంతకూ, యెవరి మాటలు నమ్మావు అక్కా? పోలీసు వాళ్ళవా, లేక బావవా?"

"అదే తోచటం లేదు!....పోలీసువాళ్ళు నిజం చెబుతా రంటావా?"

"నాకు నమ్మకంలేదు. సాధారణంగా దర్యాప్తు జరిపేప్పుడు, యెలాగైనా యెదుటివాడినించి నిజం లాగటానికి ప్రయత్నం చేస్తారు గాని తాము నిజం చెబుతారన్న నమ్మకం లేదు."

"అయితే మీ బావ చెప్పిందే నిజమంటావా?"

"ఎందుక్కాకూడదు?"

"నాకు నమ్మకం కలగటంలేదు."

"ఏం, ఎందుకనీ?"

"....నా దగ్గిర ఋజువు వుంది గనక."

రాంబాబు కళ్లు పెద్దవి చేశాడు, కనుబొమలు ముడిపడ్డాయి. "రుజువా?—ఏమిటది?"

వెళ్ళి ఆ కాగితాన్ని తెచ్చి రాంబాబు కిచ్చాను.

ఆత్రంగా తిరలా మరలా తిప్పి చూశాడు, చదివాడు. వాడి కళ్ళలో ఏదో మెరిసింది.

"ఇది నీ కెక్కడిది? బావ ఇచ్చాడా?"

"లేదు. యెలా వొచ్చిందో తెలీదు, అక్కణ్నించి తిరి గొచ్చాక చూసుకున్నాను. నా వీపు మీద రవికలో చుట్టచుట్టి వుంది. తెక్కడికెలా వొచ్చిందో నాకు తెలీదు."

"బావా నువ్వూ దగ్గిరగా వొచ్చారా?"

"ఆ, రెండు మూడుసార్లు కావలించుకున్నాడు."

"అయితే, ఇంకేం, బావే నీ కలా అందించాడు....చూశావా అక్కా! బావ యెంత తెలివిగా ప్రవర్తించాడో. నీకు తెలియ కుండానే నీకా వుత్తరాన్ని అందజేశాడు. బావకంతా తెలుసు, అక్కడేం జరుగుతున్నదో. నువ్వు గదిలోకి వెళ్ళినప్పటినించీ మీ యిద్దర్నీ కన్నాల్లోంచి గమనిస్తూనే వుంటారు. బహుశ ఫిల్మ్ కూడా తీసి వుంటారు. టేప్ రికార్డర్ మీ మాటలన్నీ టేపు చేసే వుంటుంది. అదంతా నీకు తెలీదని కూడా బావకు తెలుసు. అందుకే అంత చాక చక్యంగా దాన్ని నీకిచ్చాడు. నీకు యెలాంటి సౌజ్ఞ కూడా చేసి వుండడు."

"లేదు, చెయ్యలే....మరి దాని అర్థమేమిట్రా?"

"నువ్వు చదవలేదా?"

"చదివాను. నాలుగుసార్లు చదివాను, కాని బొత్తిగా అర్థం కాలేదు."

"నాకూ అంతే. ఇది యెవరిని ఉద్దేశించి రాశారో వాళ్ళకి అర్థమవుతుందిలే, మనకు కాదు....దీన్ని యేం చెయ్యాలనుకుం టున్నావ్?"

"మొదట్లో చించెయ్యాలనుకున్నాను. కాని యెందుకో మన సొప్పలేదు. దాచేశాను."

"మంచి పనిచేశావు. కాని యిది యిక్కడ నీ యింట్లో వుండటం ప్రమాదకరం. ఒకవేళ పోలీసులు ఏ కారణం చేతైనా ఈ

యింటిని సోదా చేస్తే వాళ్ళ చేతి కిది చిక్కితే నువ్వూ అనవసరంగా చిక్కుల్లో చిక్కుకుంటావు...."

"అయితే మరోపని చేస్తాను."

"ఏవిటి?"

"వాసు చెయ్యదలచుకోని పని, నేను చేస్తాను."

"అంటే?"

"దీన్ని రాజశేఖర్‌కి అందజేస్తాను."

"అక్కా!!"

"అవును, అప్పుడా విద్రోహులు పట్టుబడిపోతారు, వాసును వదిలేస్తారు."

"అక్కా! అది నీ భ్రమ. ఈ చీటీలో ఏముందో మనకు అర్థం కాకపోయినా, ఇది బావ పోలీసుల కస్టడీనించి తప్పించుకు పారిపొయ్యే ప్లాను అయి వుంటుంది. ఇదిగనక పోలీసులకి తెలిస్తే, బావకూడా వాళ్ళ ముఠాలో చేరినవాడేనని నిర్ధారణ అయిపోతుంది. ఇక ఈ జన్మలో బావను వదలరు."

నాకు ఎటూ పాలుపోక వూర్కుండిపోయాను.

"ఈ చీటీ నా దగ్గిరే వుండనీ" అన్నాడు.

"నువ్వేం చేస్తావు?"

"ఏం చేయాలో బాగా ఆలోచించి అదే చేస్తాను. నువ్వు మాత్రం దీని సంగతి మరిచిపో. ఎవరైనా, ఎప్పుడైనా అడిగితే నీకేం తెలీదని ధైర్యంగా చెప్పు. అది నిజం కూడాను."

"....ఒరే రామం! నీకెలా తెలిసిందిరా, నే నివ్వాళ అక్కడి కెళ్ళాననీ?"

"నా సోర్స్ చెప్పింది."

"చెప్పిందా?....అంటే....అంటే ఆడదా?...."

రాంబాబు పెద్దగా నవ్వాడు. "అవును, ఆడదే, ఏం?"

"ఎవర్రా అదీ?"

"అది అనకు, ఆమె....నీలాంటి అక్కయ్య నాకు."

నా కుతూహలం మరీ హెచ్చింది. "ఎవరు? .... ఎవరామె?

రాణీగారా?...."

"కాదు కాదు, రాణీగారు కాదు. మరొకరు. ఎవరో ఇప్పుడు చెప్పను. చెప్పగూడదు. సమయం వచ్చినప్పుడు చెబుతానన్నానుగా, అంతవరకు అడక్కు."

"అయితే. వాసు యెప్పుడు అరెస్టయినాడో కూడా నీకు అంతకుముందే తెలుసన్న మాట?"

"తెలుసు. దీపావళినాటి రాత్రే అరెస్టయాడు. అప్పట్నించీ అక్కడేం జరుగుతుందో అంతా తెలుసు."

"ఏం జరుగుతుందీ?" ఆదుర్దాగా అడిగాను.

"....బావను నానా హింసలు పెడుతూన్నారు. రోజూ నాలు గైదు గంటలు ఒకరితర్వాత ఒకరు ప్రశ్నలతో యాతనపెడుతూంటారట, విద్రోహుల ఆచూకీ చెప్పమని హింపిస్తుంటారట. అరికాళ్ళ మీదా, మోకాళ్ళమీదా, తొడలమీద రూళ్ళ కర్రలతో కొడుతూంటారట. జుత్తూ గెడ్డం పీకుతుంటారట. ఇంకా ఏమేమో చేస్తుంటారట. అవన్నీ నువ్వు వినలేవు....నువ్వు వెళ్ళినప్పుడు లేవేమోగాని ఎప్పుడూ కాళ్ళకూ, చేతులకూ సంకెళ్ళువేసే వుంచుతారట. తిండికూడా సరిగ్గా పెట్టరట....అరే, అదేమిటి, ఏడుస్తున్నావా?...."

నాకు దుఃఖంతో కోపం కూడా పొంగుకొస్తోంది.

"వారేయ్!....వారేయ్ రామం! నువ్వు చాలా కఠినాత్ముడి విరా, నాకు ఇన్నాళ్ళూ ఇదంతా యెందుకు చెప్పలేదు?"

"చెబితే ఏం చేసేదానివి? వుండబట్టలేక ఏడుస్తూ అక్కడికి పరుగెత్తేదానివి. వత్తిడి చేస్తే నా పేరు చెప్పేసేదానివి. నన్నూ, నా సోర్స్‌నికూడా అరెస్టు చేసేవారు. అంతేగా?"

నా కోపం కట్టలు తెగుతోంది: "తే, ఆ కాగితం ఇలాతే" అని గర్జించాను.

"ఏం? ఏం చేస్తావు దాన్ని, రాజశేఖర్‌కిస్తావా?"

"కాదు, ఇప్పుడే వెళ్ళి ఆ బొలారం అడ్రసు కనుక్కొని ఇచ్చి వస్తాను. ఇక వాళ్ళే నా వాసుకి దిక్కు."

"అక్కా! కాస్త శాంతించు. పిచ్చిగా ఆలోచించకు. పోలీసులు నిన్నెప్పుడూ కనిపెట్టే వుంటున్నారని మరిచిపోకు. నువ్వు నిజంగానే అక్కడికి కెళ్ళావంటే, నిన్నూ, ఆ ఇంట్లో యెవరున్నారో వాళ్ళనీ అందరినీ అరెస్టు చేస్తారు. బావమీద వాళ్ళకున్న అనుమానాలన్నీ రుజువై పోతాయి. అప్పుడు బావ సంగతి దేవుడెరుగు, నీ ఉద్యోగం కూడా వూడుతుంది."

"మరి....మరి నన్నేం చెయ్యమంటావురా?" అన్నాను నిస్సహాయంగా.

"మనం చేసేదేమీ లేదక్కా! అంతా దైవాధీనం."

నా కోపం వాసుమీదికి మళ్ళింది. "వాసు ఇలా ఎందుకు పిచ్చిగా ప్రవర్తిస్తున్నాడో నాకు అర్థం కావటంలేదు."

"పిచ్చిగానా?....అంటే?"

"ఆ వెధవలెవరో వాళ్ళగురించి తెలిసిందంతా పోలీసులకి చెప్పేస్తే పోయేదిగా....?"

"పోదు. అంత సులభంగా పోయేది కాదు."

"ఏం?"

"నువ్వన్నట్లు నిజంగానే బావ అలా చేస్తాడనుకో, వాళ్ళంతా పట్టుబడిపోతారు. వాళ్లు నిజంగానే హత్యలూ అవీ చేసివుంటే వాళ్ళకి వురిశిక్ష పడుతుంది. అప్పుడు వాళ్ళ అనుచరులూ, సహచరులూ వూర్కుంటారా? బావ మీద పగ సాధిస్తారు."

"అమ్మో! అంత పని చేస్తారా?"

"ఏమో, ఎవరు చెప్పగలరు?"

"అయితే....ఇక....ఇక వాసుకు ముక్తే లేదా?"

"చెప్పాగా, అంతా దైవాధీనమని. దైవాన్ని ప్రార్థించు."

బయట తలుపుకొట్టిన చప్పుడైంది. పనిపిల్ల లక్ష్మి పిలుస్తోంది.

"అదిగో మీ పనిపిల్ల వచ్చేసింది. ఇక నేను వెళ్తాను.... అక్కా! ఏదైతే అదవుతుంది, నువ్వుమాత్రం ధైర్యంగా వుండు. అదే కావలసింది;" అంటూ వెళ్ళిపోయాడు.

# 32

నాలుగు రోజుల తర్వాత, ఒకరోజు తెలతెలవారుతూండగా, కాల్‌బెల్ అదే పనిగా మ్రోగింది. నాకు దిగ్గున మెలుకువొచ్చింది, పనిపిల్లను లేపాను. "ఎవరూ?....ఎవరూ!" అంటూ అరిచాను.

"నేను, ఇన్‌స్పెక్టర్ రాజశేఖర్. తలుపు తియ్యండి" అన్న మాటలు వినిపించాయి. ఆందోళనగా వెళ్ళి తలుపు తీశాను.

రాజశేఖర్ లోపలికి దురుసుగా వచ్చాడు. మునుపటిలా ప్రసన్నంగా లేదు. గంభీరంగా వుంది ముఖం.

"సారీ, రమాదేవిగారూ! మీ ఇంటిని సోదా చెయ్యటానికి వచ్చాను" అన్నాడు.

"సోదానా? ఎందుకూ?"

"ఇదిగో వారెంట్" అంటూ అందించాడు. చూశాను. నక్సలైట్ లీడర్ వాసుదేవరావు ఇంటిని సోదాచేసే అనుమతి పత్రం అది.

"నాన్నగారికి ఫోన్ చేస్తాను."

"వారు వచ్చేసరికి ఆలస్యమవుతుంది. నేను అంతదాకా ఆగలేను."

పక్కింటి పిన్నిగారి కొడుకు రంగారావు జ్ఞాపకమొచ్చాడు. పనిపిల్లను పంపించాను, పిలుచుకు రమ్మని. పోలీసులు వొచ్చారు వెంటనే రమ్మనమని చెప్పాను. ఆయన అప్పుడే లేచాడేమో పాపం, హడావిడిగా, "ఏమిటమ్మా?" అంటూ వచ్చాడు.

"అయామ్ సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ రాజశేఖర్" అంటూ తన కార్డు చూపించాడు.

అది చూపి "వెల్" అన్నాడు రంగారావు.

"నేను ఈ ఇంటిని సోదా చెయ్యటానికి వచ్చాను. ఇదిగో వారంట్" అదీ చూపించాడు.

రంగారావు చూసి, "ఏమ్మా రమా! ఇది చూశావా?" అన్నాడు.

"చూశాను అన్నయ్యా!" అన్నాను.

"వారంట్ సరిగ్గానే వుంది కాబట్టి అభ్యంతరం చెప్ప

కూడదు."

"మీ పేరు?" అడిగేడు రాజశేఖర్.

"రంగారావు, అడ్వకేట్."

"గుడ్ మీరూ వుంటే బావుంటుంది. ఇక నేను సోదా మొదలెట్ట వచ్చా?"

"కానివ్వండి."

రాజశేఖర్ సైగ చెయ్యగానే బయట నిలుచుని వున్న నలుగురు జవాన్లు బిలబిలా లోపలి కొచ్చారు. ఒక్కొక్క గదే వెతకటం మొదలెట్టారు. వాళ్ళ వెనకాల రంగారావూ, నేనూ తిరుగుతున్నాము. మూల మూలలా, మంచాల క్రిందా, అటకమీదా, ఆఖరికి దొడ్డీ, బాత్ రూంలల్లో కూడా వెతికారు. ఎక్కడా వాళ్ళకు కావలసింది దొరికినట్టు లేదు.

"ఎక్స్‌క్యూజ్ మీ, మీరు దేనికోసం వెతుకుతున్నారో తెలుసుకోవచ్చా?" అని అడిగాడు రంగారావు.

"సారీ, చెప్పలేను" అని కొంచం కటువుగానే జవాబిచ్చాడు రాజశేఖర్. అప్పటికే అతని మొహాన నిరాశ ఛాయలు ద్యోతకమవ్వుతున్నాయి.

"ఈ అల్మారా తాళాలెక్కడ?" అన్నాడు.

నేను రంగారావుకేసి చూశాను.

"నువ్వే తీసి చూపించమ్మా" అన్నాడు ఆయన. తాళాలు తెచ్చి, తలుపు తెరిచాను. ఒక్కొక్క వస్తువే తీసితీసి చూశాడు. ఏమీ దొరకలేదు.

"ఉత్తరాలు ఎక్కడ?" అన్నాడు.

"ఏ ఉత్తరాలు?"

"మీరూ మీ భర్తా రాసుకున్నవి. మీ భర్తకు ఇతర్లు రాసినవి."

"మే మెప్పుడూ ఒకరి కొకరం ఉత్తరాలు రాసుకోలేదు. అలాంటి అవసరమే పళ్ళేదు. నా భర్తకు యెప్పుడూ ఏ ఉత్తరమూ రాలేదు" అన్నాను ధైర్యంగా. రంగారావు కళ్ళల్లో మెచ్చుకోలు కనిపించింది. రాజశేఖర్ నమ్మకపట్టుగా నావేపు కోపంగా చూసి వూరుకున్నాడు. పుస్తకాల బీరువా దగ్గరికెళ్ళి ఒక్కొక్క పుస్తకమే తీసి

చూశాడు. ఆఖరికి రెండు మూడు పుస్తకాలూ, కొన్ని కరపత్రాలూ తీసుకున్నాడు.

"ఆ పుస్తకాలమీద నిషేధముందా?" అని అడిగాడు రంగారావు.

"పుస్తకాలే కాదు, కరపత్రాలు కూడా వున్నాయి. ఇవి లీగలు కాదు. నేనిప్పుడు చెప్పలేను. అనుమానంమీద తీసికెళ్తున్నాను" అన్నాడు గంభీరంగా.

"తప్పకుండా తీసుకెళ్ళండి. కాని వాటికి రసీదు యివ్వాల్సి వుంటుంది."

"ఓ.కె." అని హెడ్‌కానిస్టేబుల్‌చేత వాటి జాబితాలు తయారు చేయించి, రెంటిమీదా సంతకంపెట్టి, నా సంతకమూ రంగారావు సంతకమూ తీసుకుని, ఒకటి నాకిచ్చి రెండవది జేబులో పెట్టుకుని, "థేంక్యూ మిస్టర్ రంగారావు....నా పని అయిపోయింది" అంటూ బయలుదేరాడు. వాసు గురించి మళ్ళీ అడగాలని నోటిదాకా వచ్చింది. కాని రంగారావు వున్నాడని నిగ్రహించుకున్నాను.

ఇంతలో పిన్నిగారు కూడా వొచ్చింది, "ఏమిటే అమ్మాయి! ఏమవుతోందీ?" అంటూ.

"ఏముంది పిన్నీ! అంతా నా ఖర్మ!" అన్నాను.

"అవున్లే తల్లీ! నేను ఆనాటినించీ అంటూనే వున్నాను. నువ్వు ఆ జులాయి వెధవ...."

"అమ్మా! ఆపు, యేమిటా మాటలు?" అంటూ గదమాయించాడు రంగారావు. "మధ్య నీ సోదేమిటి?" అన్నాడు. తల్లి నోరు నొక్కుకుంది.

"చూడమ్మా రమా; వాళ్ళు సోదా చేసిన తీరును చూస్తే, వస్తువుల కోసం రాలేదు, ఎవరి కోసమో వచ్చినట్టున్నారు. బహుశ నీ భర్త యిక్కడ దాక్కున్నా డనుకుని వచ్చారేమో...."

"ఆయన యింటికొచ్చి ఆర్నెల్లయింది" అన్నాను మెల్లిగా రుద్ధకంఠంతో.

# 33

రంగారావు సోదా గురించి వెలిబుచ్చిన అభిప్రాయం వినగానే నాకు పట్టరాని సంతోషం పుట్టుకొచ్చింది. వాసు...నా వాసు ఇక పోలీసు కస్టడిలో లేడన్నమాట. భగవంతుడా—బాధలు తప్పాయి. మనసులోనే దేవుడికి దణ్ణం పెట్టుకున్నాను.

తలుపు గడియ వెయ్యగానే, ఫోన్‌చేసి రాంబాబును రమ్మన్నాను. వాడు వచ్చేసరికి తొమ్మిదయింది. అంతా చెప్పాను. విని, వాడు మౌనంగా వుండిపోయాడు.

"ఏంరా, మాట్లాడవేం? రంగారావు చెప్పింది నిజం కాదంటావా?"

"అయ్యే వుంటుంది."

"అంటే వాసు పోలీసుల నుండి తప్పించుకు పారిపోయినట్టేగా?"

"....నాకు తెలుసు."

"నీకు తెలుసా?"

"అలా జరుగుతుందని అనుకున్నాను. కాని అది ఇంత తొందరగా జరుగుతుందని తెలీదు."

నాకు అనుమానం వేసింది. "అయితే ఆ చీటీ నువ్వే బొలారాం అడ్రసుకు తీసికెళ్ళి...."

"కాదు కాదు. నే నివ్వలేదు."

"మరి?"

"... నా సోర్స్‌కిచ్చాను. ఆమె ఏం చేసిందో ఏమో, తర్వాత సంగతి నాకేమీ తెలీదు."

నా కుతూహలం మళ్ళీ మొలకెత్తింది. "ఎవర్రా ఆమె? ఇప్పుడైనా చెప్పకూడదూ?"

"ఎందుకూ?"

"ఎందుకేమిట్రా, నా కృతజ్ఞతను తెలుపుకోవద్దూ? నా కివాళ యెంత సంతోషంగా వుందో తెలుసా?"

"దేనికి?"

"వాసుకు పోలీసులు పెట్టే బాధలు తప్పాయిగా?"

"అది బాగానే వుంది. కాని మరొహాటి ఆలోచించావా? పోలీసు కస్టడీనించి పారిపోతే సరా? ఆ తర్వాత వాళ్ళు వెంటాడుతూ తరుముతూ వుంటే, తప్పించుకు తిరుగుతూ, గుట్టనకా, చెట్టనకా, పగలనకా రాత్రనకా వేటాడబడుతున్నట్టు తిరగటంలో సుఖముందనుకున్నావా?"

నా మొహం పాలిపోయింది.

"చూడక్కా! నిన్ను నిరుత్సాహ పరచాలని కాదు నేను నీకిదంతా చెప్పటం. యదర్థం గ్రహించమని, అంతే... బావ ఎలాంటివాడో తెలిసో, తెలీకో కోరి చేసుకున్నావు. ఇప్పుడు నీకు బాగా తెలుసు అతని భావాలూ, అతని స్నేహాలూ; అతని జీవితం ఏమిటో అంతా తెలుసు. అలాంటి జీవితంలోని సాధక బాధకాలేమిటో అవీ నువ్వు గ్రహించి మసలుకోవాలి. ఇలా ఘడియ ఘడియకీ భయభ్రాంతులతో బ్రతుకుతూంటే, నువ్వు సాధించేదేదీ లేకపోగా, మనశ్శాంతికూడా కోల్పోతావు... నువ్వు ఈ విషయంలో కొంత నిర్లిప్తత అలవరచుకోవాలి. నీ పిల్లల ఉజ్వల భవిష్యత్తే నీ జీవిత పరమార్థంగా పెట్టుకుని, కాస్త మొండిగా, ధైర్యంగా బ్రతకాలి...." అంటూ ఏమేమో చెప్పుకుపోతున్నాడు. నేను తల వంచుకుని వింటూ కూచున్నాను.

"రామం! నాకు ఒక్కటి అర్థం కావటంలేదురా."

"ఏమిటి?"

"... వాళ్ళు ఇన్ని ఇక్కట్లకు పాల్పడి ఏం సాధిద్దామని?"

"నువ్వు బావనెన్నడూ ఈ ప్రశ్న వెయ్యలేదా?"

"లేదు, అసలు రాజకీయాల ప్రసక్తే యెత్తనిచ్చేదాన్ని కాదు."

"ఏముందీ, మనిషికీ, మనిషికీ మధ్య తారతమ్యాలు లేని సమ సమాజం నెలకొల్పాలని వాళ్ళ ఆకాంక్ష."

"ఎలా?"

"అలాంటి ప్రజాప్రభుత్వాన్ని స్థాపించి."

"ఇప్పటి ప్రభుత్వం ప్రజాప్రభుత్వం కాదా?"

"కాదనే వాళ్ళ వాదన."

"మరి, అది సాధ్యమా?"

"ఏమో, ఎవరు చెప్పగలరు? .... మన భారతదేశంలో ఇప్పుడప్పుడే సాధ్యపడుతుందని నేనూ అనుకోను."

"మరీ?"

"ఎవరి నమ్మకాలు వాళ్ళవి, దానికి మనమేం చెయ్యగలం?... అక్కా! నువ్వీ విషయాలన్నీ ఆలోచిస్తూ అనవసరంగా బుర్ర పాడు చేసుకోకు. వస్తా."

వెళ్ళటానికి లేచాడు.

"ఒరే రామం, ఒక్కమాట."

"ఏమిటక్కా?" మళ్ళీ కూచున్నాడు.

"....మీ బావ మంచికో చెడుకో ఒకదారిన పోతున్నాడు. ఆ దారినే నేనూ వెళ్ళటం నా ధర్మంకాదూ?"

ఉలిక్కిపడ్డాడు రాంబాబు. నా చేతులు గట్టిగా పట్టుకున్నాడు. "అక్కా! ఏమిటి నువ్వు....నువ్వంటున్నది? అది ప్రమాదకరమైన దారని తెలిసికూడా నువ్వూ వెళ్తానంటున్నావా? నీ పిల్లలు - నీ పిల్లల విషయం ఆలోచించావా?"

"అందుకే విచారిస్తున్నాను. వాళ్ళు లేకుండా వుంటే...."

"ఛాఛా! ఏం మాట్లవి? నువ్విలా పిచ్చిగా మాట్లాడావంటే విన్నిక్కడ ఒక్క క్షణం కూడా వుండనివ్వను. ఇంటికి తీసికెళ్ళిపోతాను."

"సరేలే, మాట్లాడను. నువ్వెళ్ళు, కాలేజీకి పొద్దుపోతోంది."

"నువ్వు ముందు నాకో వాగ్దానం చెయ్యి, నాకు తెలియకుండా, నాతో చెప్పకుండా నువ్వు ఏ దిక్కూ ఒక్క అడుగుకూడా వెయ్యనని."

"సరేలే, వెయ్యను. వెళ్ళు."

వాడు అనుమానంగా నావేపు చూస్తో, నన్ను సందిగ్ధావస్థలోనే వదిలి వెళ్ళాడు.

# 34

ఆ రోజు సాయంత్రమే అకస్మాత్తుగా నాన్నగారూ, రాంబాబూ కలిసి కారులో వచ్చారు. నాకు అయోమయంగా వుంది. రాంబాబు ముఖంలోకి చూశాను. వాడు తల తిప్పేసుకున్నాడు.

నాన్నగారు నా చెయ్యి పట్టుకుని కూచోబెట్టి అన్నారు, "ఏమ్మా! ఇంత జరుగుతూన్నా నాతో ఒక్కమాటైనా చెప్పలేదేం?"

"ఏం జరిగింది నాన్నా?"

"అదేమిటమ్మా! ఇంకా దాస్తావా? ఇవ్వాళ ఈ ఇంటిని సోదా చేశారటగా?"

అనుమానంగా రాంబాబుకేసి చూశాను. వాడి మొహం బ్లాంక్‌గా వుంది. "మీకెలా తెలిసింది నాన్నా?"

"ఆ అబ్బాయి రంగారావు ఫోన్ చేసి చెప్పాడు."

"ఓహో!" అటువేపుకు ధ్యాసే పోలేదు.

"నాకెందుకు తెలియజెయ్యలేదమ్మా?

నేను మౌనంగా తల వంచేసుకున్నాను.

"ఇప్పుడు మీ ఆయన యెక్కడున్నాడో ఏమైనా తెలుసా?"

చటుక్కున మళ్ళీ రాంబాబువేపుకు చూశాను. వద్దన్నట్టు సౌజ్ఞ చేశాడు.

"ఏమో నాన్నా! తెలీదు. ఆయన్నుచూసి ఆర్నెల్లయింది."

"ఆయనకోసమేనటగా సోదా జరిగింది?"

"ఏమో నాన్నా! తెలీదు. వాళ్ళు కారణం చెప్పలేదు."

"....సరే, అయిపోయిందేదో అయిపోయింది. ఇక నువ్వు ఇక్కడ వుండటానికి వీల్లేదు."

"నాన్నా!"

"అవునమ్మా! ఇక్కడ నువ్విలా వొంటరిగా ఇలాంటి వాటి కన్నిటికీ గురవుతూ వుంటే, అక్కడ మాకు నిద్రపడుతుందా?....మీ అమ్మ కుమిలి కుమిలి ఏడుస్తోంది....పద, మనింటికెళ్దాం పద."

"క్షమించండి నాన్నా! నేను రాలేను."

"అమ్మా!"

"అవున్నాన్నా! నా ఇల్లూ, సంసారం అని ఒకటి ఏర్పాటు చేసుకున్నాక....ఇక దీన్ని వదల్లేను."

"నా మాట విను తల్లీ!"

"మీరుండండి నాన్నా! అక్కకి నేను చెబుతాను" అంటూ రాంబాబు కలగజేసుకున్నాడు. "ఇలా రా అక్కా!" అంటూ నా చెయ్యి పట్టుకుని లోపలి గదిలోకి తీస్కెళ్ళాడు. తగ్గుస్వరంతో అన్నాడు, "అక్కా! నాన్నమాట విని ఇంటికి వచ్చేయ్. అదే అన్ని విధాలా మంచిది. ఇన్నాళ్ళూ నువ్వు ఇక్కడ బావ కోసం వున్నావు. బావ ఇక ఇక్కడికి రాడు. ఒకసారి వస్తే ఏం జరిగిందో తెలుసుగా? పోలీసులకి పట్టుబడి పోయాడు. మళ్ళీవస్తే మళ్ళీ అదే జరుగుతుంది. నువ్వు మనింటికి వచ్చేస్తే, ఆ విషయం బావకి తెలిస్తే, ఆయనకి నీ గురించిన దిగులు తీరుతుంది. ఇక ఇటు ఛాయలక్కూడా రాడు, పోలీసులకి చిక్కబడడు....అదే మంచిదని నా సోర్స్ కూడా అంది."

"ఆఁ?....నిజంగానా?"

"అవునక్కా! ఆమెకూడా అదే సలహా ఇచ్చింది .... పద, నాన్నాగారితో చెప్పు" అంటూ నన్ను బయటికి లాక్కొచ్చి, "నాన్నా! అక్క ఒప్పుకుంది" అన్నాడు.

నాన్నగారి మొహం వికసించింది.

"కాని....కాని నేనీ ఇంటిని ఖాళీ చెయ్యను. లాక్ వేసి పెడ్తాను."

"సరే, నీ ఇష్టం. అవసరమైనవి మాత్రం తెచ్చుకో."

అలాగే చేశాను. అన్నీ కారులో సర్దుకున్నాక, ఇంటికి తాళం పెట్టి, ప్రక్కింటి పిన్నిగారికీ, రంగారావుకూ చెప్పి బయలుదేరాను. పనిపిల్ల తల్లితో మాట్లాడి దాన్నికూడా వెంట తీసుకొచ్చాను.

ఇంటికెళ్ళగానే అమ్మ నన్నూ పిల్లల్నీ కావిలించుకుని బావురుమంది. నేను నిర్లిప్తంగా వుండిపోయాను.

మేడపైన నా పాత గదిలో మళ్ళీ చేరాను. ప్రక్కనే రాంబాబు గది.

రెండో రోజు రాంబాబు వీలు చూసుకుని నాకు రహస్యంగా

సలహా ఇచ్చాడు, "రేపో యెల్లుండో వెళ్ళి రాజశేఖరాన్ని ప్రతి మాలుకో బావని మళ్ళీ ఒకసారి కలుసుకుని ప్రాధేయపడతానని. దాని వల్ల రెండువిధాల లాభం. ఒకటి, బావ వాళ్ళ కస్టడీలో వున్నాడో లేదో తెలిపోతుంది. రెండు, బావ నిజంగానే పారిపోయి వుంటే ఆ విషయం నీకు తెలీదని వాళ్ళకి నమ్మకం కుదురుతుంది. ఇక్కడికి కాం మార్చాననీ కూడా తెలియజెయ్. నీమీద నిఘా తగ్గిపోతుంది."

## 35

ఆ మరుసటి రోజు ఫోన్‌చేసి, రాజశేఖర్ ఆఫీసులోనే వున్నాడని నిర్ధారణ చేసుకుని, వెళ్లాను. మొన్నటిలాగే మొహంలో కళ లేదు. కాని నేనేమైనా చెప్పటానికి వచ్చానేమోనన్న ఆశ కళ్లల్లో కనిపిస్తున్నది.

"రాజశేఖర్‌గారూ! నేనిప్పుడు మా నాన్నగారింటికి మారానండీ" అన్నాను ఉపోద్ఘాతంగా.

ఎందుకన్నట్టు చూశాడు.

"మొన్న జరిగిన సోదా విషయం నాన్నగారికి తెలిసిపోయింది. వెంటనే వచ్చి నేనిక వంటరిగా వుండటం మంచిదికాదని తీసికెళ్లారు."

"ఇది చెప్పటానికేనా ఇంతదూరం వచ్చింది?"

"కాదు."

"మరి?" మళ్ళీ ఆశ పొడసూపింది.

"మిమ్మల్ని ప్రార్థించటానికి."

"దేనికి?"

"మళ్ళీ నాకొక ఛాన్సు ఇప్పించమని. వాసును కలుసుకుని ప్రాధేయపడతాను, మీమాట వినమని."

రాజశేఖర్ హతాశుడై తల వంచేసుకున్నాడు. "వీల్లేదు" అన్నాడు.

"ప్లీజ్! ఒక్కసారి."

"వీల్లేదన్నానుగా...." అన్నాడు విసుగ్గా.

"ఏం? ఎందుకని?"

"అతనిప్పుడు ఇక్కడ లేడు."

నా హృదయం గంతులేసింది.

"మరీ?"

"మరో చోటికి మార్చాం."

"పోనీ, అక్కడికే నన్ను తీసికెళ్ళండీ...."

"వీల్లేదని ఎన్నిసార్లు చెప్పాలి?" అన్నాడు కోపంగా. "ఇక మీరు వెళ్ళిపొండి....ఏయ్ ప్యూన్!" అంటూ బెల్ నొక్కాడు.

నేను వచ్చినపని నెరవేరింది. దిగులుగా మొహంపెట్టి, నమస్కారం చేసి, లేచాను; ఈవలికొచ్చేశాను. ఇంటికొచ్చి, రాంబాబుతో చెప్పాను.

x x x x

ఆ తర్వాత నాన్నగారింట్లో నా కొత్త జీవితం ప్రారంభమయింది. యాంత్రికంగా అన్ని పన్లూ చేసుకుపోతున్నాను. కాలేజీకి వెళ్ళి వస్తున్నాను. పెద్ద పిల్లలిద్దరూ అమ్మా నాన్నలకి బాగా అలవాటైపోతున్నారు. వాళ్ళను స్కూలు మార్చి, దగ్గర్లో వున్న మరో స్కూల్లో చేర్పించాను. చిట్టి పనిపిల్లదగ్గిరా లేక నాదగ్గిరా తప్ప మరెవ్వరి దగ్గరికీ వెళ్ళేది కాదు. అప్పుడప్పుడు రాంబాబు ఆడిస్తూ వుండేవాడు. విశాలమైన కొత్త యిల్లు, ఆ వాతావరణం పిల్లలందరికీ బాగానే వచ్చినట్టుంది.

వాసు జాడ మాత్రం మళ్ళీ తెలీలేదు. ఎక్కడున్నాడో, ఎలా వున్నాడో ఏమీ తెలిసిరావటంలేదు. రాంబాబును అడుగుతూనే వున్నాను. వాడికీ ఏమీ తెలీటంలేదనీ, బహుశ సురక్షితంగానే వుండి వుంటాడనీ చెబుతున్నాడు. అప్పుడప్పుడు మెహదీపట్నం ఇంటికి వెళ్ళి వస్తూండేదాన్ని, ఉత్తరాలుగానీ, పుస్తకాలుగానీ వచ్చాయేమోనన్న ఆశతో. ఏమీ రాలేదు. జడంగా, మొండిగా బ్రతుకుతూన్నాను. అలాగే చాలా రోజులు గడిచిపోయాయి.

x x x x

ఒకసారి నాన్నగారు టూర్‌మీద వెళ్ళినప్పుడు, అక్కడెవరో బంధువుల్ని చూడాలని అమ్మకూడా ప్రయాణం కట్టింది. వెంట పెద్ద పిల్లలు కూడా వస్తామని మారాం చేశారు. వాళ్ళనీ సిద్ధంచేసి తీసి

కెళ్ళింది. నేనూ, చిట్టీ, రాంబాబు మాత్రం మిగిలిపోయాము. వాళ్ళు వెళ్ళిపోయిన మరుసటిరోజు సాయంత్రం నేను కాలేజీనించి తిరి గొచ్చిన కొద్దిసేపటికి ఇంటిముందు ఒక పెద్ద కారు వచ్చి ఆగింది. ఎవరొచ్చారా అని చూస్తున్నాను. కార్లోంచి ఒక అల్ట్రా మాడర్న్ యువతి దిగింది. ఖరీదైన షిఫాన్ చీర, అదేరంగు చేతుల్లేని బ్లౌజు, బాబ్డ్ హేర్, కళ్ళకు నల్లద్దాలు, మొహానికి రోజ్, పెదాలకి లిప్‌స్టిక్, నొసట శారీ కలర్ బొట్టు, ఒక చెంపకు బ్యూటీ స్పాట్, ఒక చేతికి గడియారం, మరోచేతికి రెండే రెండు బంగారు గాజులు, మెళ్ళో సన్నని బంగారు గొలుసు, చేతిలో వానిటీ బ్యాగు పట్టుకుని, హైహీల్డ్ షూప్ టకటకమనిపించుకుంటూ మెట్లెక్కింది.

రాగానే "హల్లో రమా!" అంది ముత్యాల్లాంటి పలువరస ప్రదర్శిస్తూ.

'ఎవరీ అందాలరాశి!' అని విస్తుపోతూ, విశ్శబ్దంగా నిలుచుండి పోయాను. దగ్గరికొచ్చి, నా చేతులు పట్టుకుని, "ఏం, నన్ను గుర్తు పట్టనేలేదా రమా!" అంటూ కళ్లద్దాలు తీసి, "ఇప్పుడు చూడు" అంది.

ఎక్కడో చూసిన మొహంలాగే వుంది, ఎక్కడో విన్న కంఠంలాగే వుంది. కాని యెక్కడో, యెప్పుడో, యెవరో అంతు పట్టటంలేదు. అదే సూచిస్తూనట్టు తల అడ్డంగా తిప్పాను.

"నేను రమా! నేను.... వనజని...."

"ఆ! వనజా!...." అన్నాను. అప్రయత్నంగా నా వళ్లు జలదరించింది. "నువ్వు....నువ్వు...."

"అవును, నేనే....నేనింకా బ్రతికే వున్నాను రమా!"

నా సంభ్రమాశ్చర్యాలకి అంతులేదు. "వనజా!" అంటూ అమాంతంగా కౌగిలించుకున్నాను.

ఇంతలోకి డ్రైవర్ లోపల కేవేవో పట్టుకొస్తున్నాడు. పండ్లూ, మిఠాయీ, గుడ్డలూ, ఆట వస్తువులూ....

"ఏమిటి! ఏమిటిదంతా వనజా!" అన్నాను కాస్త తేరుకుని.

"నీకు కాదులే, పిల్లలకి....పద పైకి, వెళ్దాం. నీ గదిలో కూచుని మాట్లాడుకుందాం" అంటూ తానే దారితీసింది.

గదిలో అడుగు పెట్టగానే నలువేపులా చూస్తూ అడిగింది, "ఏదీ, చిట్టి ఎక్కడ?" అని.

"పిల్లలు అమ్మతో...."

"అది తెలుసు. పెద్ద పిల్లలు వెళ్ళారు ...మరి చిట్టి?"

"నీకు తెలుసా? ...ఎలా?"

"అదంతా తరవాత చెబుతాను. ముందు చిట్టిని తీసుకురా."

వెనక దొడ్లో చిట్టిని ఆడిస్తూన్న పనిపిల్లను కేక వేశాను, చిట్టిని తీసుకురమ్మని. అది వచ్చేదాకా వనజ ఆత్రంగా ఎదురు చూస్తోంది. రాగానే గభాల్న చిట్టిని ఎత్తుకొని, గుండెకు హత్తుకొని ఒకటే ముద్దులు పెట్టుకోవటం మొదలెట్టింది. అది బావురుమంది. గుక్క తిప్పుకోకుండా ఏడుపు లంకించుకునేసరికి, దాన్ని ఎలా సముదాయించాలో తెలియక చప్పున పనిపిల్ల కిచ్చేసింది. అది వెళ్ళి పోతోంటే చిట్టివేపే దీనంగా, అతిదీనంగా చూస్తూ వుంది. తనది కావలసిన వస్తువును ఎవరో అపహరించుకు పోతోంటే, తాను నిస్స హాయంగా చూస్తూ నిలిచిపోయిన భావన ఆ కళ్ళల్లో కనిపిస్తోంది. కళ్ళవెంట బొట బొటా నీటిచుక్కలు కారుతున్నాయి. నేను దగ్గరి కెళ్ళి భుజం చుట్టూ చెయ్యివేసి, మెల్లిగా "వనజా,....వనజా!...." అన్నాను.

నావేపు తిరిగి, "రమా!....రమా! ఏం చెప్పను?"

"నువ్వు ఏమీ చెప్పక్కర్లేదు. నేను అంతా అర్థం చేసుకో గలను....పద...." అంటూ తీసుకెళ్ళి మంచంమీద కూచోబెట్టాను. అలా చాలాసేపు మౌనంగా కూచున్నాం.

ఆఖరికి వనజే ముందుగా తేరుకుంది. కొంగుతో కళ్లు తుడుచు కుని, చిన్నగా నవ్వింది. "ఊఁ, ఇప్పుడడుగు, ఏం అడుగుతావో?"

"అడగటానికేం వంద ప్రశ్నలున్నాయి" అన్నాను.

"నాకు తెలుసు....ఆ పాత బీదపిల్ల వనజాక్షికీ ఈ దర్జా మనిషికీ పోలికేలేదు కదూ?....అవును, రమా! ఆ వనజాక్షి ఆనాడే చచ్చిపోయింది. వాసు యింట్లోంచి తరిమివేసిన రోజునే చచ్చి పోయింది. ఇప్పుడు నేను, నేనుగా బ్రతికే వనజని, కాదు, పేరు

కూడా మారిపోయింది: మిస్ విన్నీ....!"

"విన్నీ?"

"అవును, నా పేరు యిప్పుడు విన్నీ. ది ఫేమస్ మోడల్ గర్ల్...."

"మోడల్?....నువ్వు మోడలింగ్ చేస్తావా?...."

"మోడలింగ్ ఒక్కటే కాదు రమా! ఇంకా ఎన్నో, ఎన్నో స్తాను. అవన్నీ అడక్కు. నేను సమాధానం చెప్పను, చెప్పలేను. నన్ను, నన్నుగా స్వీకరించు. అంతే చాలు....ఇంతకూ నే నిప్పుడు ఎందుకొచ్చానో తెలుసా?"

"తెలుసు."

"తెలుసా?...." పెద్దగా నవ్వింది. "యేదీ, చెప్పుకో చూద్దాం."

"వాసుకోసం, వాసును నాకు అప్పగించి వెళ్లావు కదా? ఇప్పు డెలా వున్నాడో చూసిపోదామని వచ్చావు."

మళ్ళీ నవ్వింది. "అనుకున్నాను. నువ్వలాగే పొరబడతావని అనుకున్నాను....కాదు రమా! కాదు. నేను వాసు కోసం రాలేదు. నిన్నూ, నీ పిల్లల్ని చూసిపోదామనే వచ్చాను....వాసు యిక్కడ లేడని నాకు తెలుసు. ఇప్పు డెక్కడున్నాడో నీకు తెలీదని కూడా తెలుసు....రమా! మీ సంగతి అంతా....అంతా నాకు తెలుసు. నే విన్నాళ్ళూ యెక్కడో లేను, యిక్కడే, యీ పట్నంలోనే వున్నాను...."

నాకు చప్పున ఒకటి జ్ఞాపకమొచ్చింది. "అయితే....రాణి గారు అంటే నువ్వేనన్నమాట...."

"రాణిగారా?....రాణిగా రెవరూ?....ఓ, ఆమెనా....కాదు కాదు, నేను కాదు ఆ రాణిగారిని. ఆమెకూ నాకూ సామ్యమేమిటి? ఆమె ఓ గొప్పింటి ఆడపడుచు. కవిత్వమంటే పిచ్చి, కవులంటే అభిమానం. కవుల్ని ఆప్యాయంగా ఆదరిస్తుంది...."

"చెప్పు వనజా! వాసు యిప్పు డెక్కడున్నాడో చెప్పు, ఆమె ఇంట్లోనా, నీ ఇంట్లోనా?"

"ఊహుఁ, అక్కడా లేడు, నా దగ్గిరా లేడు."

"మరి?....మరెక్కడున్నాడు?"

"ఎందు కంత తాపత్రయం....? తెలుసుకొని యేం చేస్తావు?...."

"ఏం చేస్తానా....? ఏమిటా ప్రశ్న? వాసు....వాసు....నా భర్త."

"భర్తా?" పెద్దగా నవ్వింది.

నాకు కోపమొచ్చింది. "ఎందుకా నవ్వు?"

"నువ్వు ఎంత అమాయకురాలివి రమా?....వాసు నీ కొక్కడికే భర్త అనుకున్నావా?....నాకూ భర్తే."

"వనజా!...."

"అవును రమా! వాసు నీకు తాళి కట్టాడేమో, నాకు కట్టలేదు. అంతే తేడా....ఆఁ, మరొక్క తేడా కూడా వుంది. ఆ పిచ్చివాడు నిన్నూ, నీ పిల్లల్నీ ప్రేమిస్తాడు, జీవితాంతం ప్రేమిస్తూనే వుంటాడు. అందులో మార్పు రాదు....కాని, నేను....నేను ఎక్కడ వున్నా, యెలా వున్నా అతణ్నే నా భర్తగా ఆరాధిస్తాను, చివరి వూపిరిదాకా ఆరాధిస్తూనే వుంటాను" వనజ కంఠం రుద్ధమై పోయింది, ఆగిపోయింది.

నేను వనజ భుజంమీద చెయ్యివేసి అన్నాను, "వనజా! ఆపకు. చెప్పు, చెప్పుకుపో....వాసూ నువ్వూ తరచూ కలుస్తూ వుండేవారా?"

"కలుసుకోవటం అరుదు, చాలా అరుదు....నన్నంటే, నా జీవితమంటే రోత, అసహ్యించుకొనేవాడు; తిట్టిపోసేవాడు....ఎన్నో సార్లు ప్రాధేయపూర్వకంగా చెప్పాను, 'నీకూ, రమకూ పొత్తు కుదరదు, మీరు రైలు పట్టాలవంటి సమాంతర రేఖలు, కలిసి వుండలేరు. నన్ను స్వీకరించు, నీ దాసీగా స్వీకరించు. దుర్గంధపూరితమైన నా పాడు జీవితాన్ని త్యజిస్తాను. నీ ధ్యేయమే నా ధ్యేయం, నీ జీవితమే నా జీవితంగా పరిగ్రహిస్తాను. ఎన్ని కష్టాలూ, యెన్ని ఆపదలొచ్చినా వెనుదీయను. అన్ని రంగాల్లోనూ నీ నీడగా నిలబడతాను.

నా కంతే చాలు' అని యెంతో ప్రతిమాలుకున్నాను. కాని, నా నీడ కూడా సోకనివ్వకుండా, దూర దూరంగా వెళ్ళిపొయ్యేవాడు. అయినా నేను అజ్ఞాతంగా కనిపెడ్తూనే వుండేదాన్ని. ప్రత్యక్షంగా, పరోక్షంగా వీలైనంత సహాయం చేస్తూనే వుండేదాన్ని. అతనికే కాదు, అతనికి ప్రీతిపాత్రమైన పార్టీకీ, పార్టీలోని సహచరులక్కూడా చేయూత నిచ్చేదాన్ని. కాని....కాని"

ఆ మాట పూర్తిచెయ్యలేకపోయింది.

"అక్కా! అక్కా! నువ్విక్కడా? నేను మీ యింటి కెళ్ళొస్తున్నాను....అదేమిటక్కా! ఇన్నాళ్ళూ నేను యెన్నిసార్లు రమ్మన్నా రానన్నావు, నీ గురించి చెప్పనుకూడా చెప్పొద్దన్నావు. ఇవ్వాళకు నీకై నువ్వే వచ్చావా?...."

వనజ రాంబాబుకు జవాబివ్వకుండానే, బ్యాగు అందుకుని, "రమా! వస్తా" అని లేచింది.

"వనజా! ఆగు, తొందరేమిటి?" అని చేతులు పట్టుకోబోయాను.

నన్ను తప్పించుకుని, "లేదు లేదు, నేను వెళ్ళాలి. నాకు చాలా పన్లున్నాయి, గుడ్ బై....!" అంటూ చక చకా వెళ్ళిపోయింది.

"అదేమిటి అక్కా! 'వనజ' అంటావు. ఆమె పేరు విన్నీ కదా?" అంటున్నాడు రాంబాబు.

"ఆమె యెవరో తెలుసా?" అన్నాను.

"నువ్వింకా గ్రహించుకోనే లేదా....? నా సోర్స్ అన్నానే!...."

"అది వూహించుకున్నాలే. కాని ఆమె అసలు ఎవరో నీకు తెలుసా, అంటున్నాను."

"నీకు తెలుసా?"

"నాకు ఇంటర్‌లో క్లాస్‌మేటు. పేరు వనజాక్షి....వాసుకు స్వయాన మేనమరదలు."

"ఆఁ? నిజంగానే?.... అయితే, అందుకేనేమో బావ అంటే

అంత అభిమానం. తనను కూడా అక్కా! అని పిలవమని ఒత్తి చేసేది."

"అసలు మీకు పరిచయం యెలా అయిందిరా?"

"ఒకరోజు నేను ఆబిడ్ రోడ్డున నడిచి వెళ్తోంటే, రొడ్డు ప్రక్కన ఆమె కారు ఆగి వుంది. నేను కొంతదూరం పోయాక డ్రైవర్ వచ్చి నన్ను పిలిచాడు. వెళ్ళాను. "నువ్వు రమాదేవి తమ్ముడు రాంబాబువి కదూ?" అంది. అవునన్నాను. "రా, కూచో" మని కారులో కూచోబెట్టుకుని తన బంగళాకు తీసుకెళ్ళింది. ఏమేమో తింటానికి పెట్టింది. బలవంతాన తినిపించింది. నీ గురించీ, పిల్లల గురించీ, వాసు బావ గురించీ అడిగడిగి తెలుసుకుంది. "మీ రెవరు? వాళ్లు మీ కెలా తెలుసు?" అని యెంత అడిగినా చెప్పలేదు. "నేను కూడా మీ రమలాంటి అక్కయ్యనే నన్నూ అక్కా అని పిలు, వీలై నప్పుడల్లా వస్తూ వుండు. కాని రమకు గానీ, మరెవ్వరికి గానీ యీ విషయం తెలియనివ్వొద్దు" అని తన చేతిలో చేయి వేయించుకుని ప్రమాణం చేయించుకుని మరీ పంపించింది. ఆనాటినించి వారానికి కనీసం ఒకసారైనా వెళ్ళి వస్తూండేవాణ్ని. అంతా మన గురించే అడుగుతూండేదిగాని తన సంగతి ఒక్కటీ చెప్పకపోయేది. కాని నేను యితరత్రా విన్నాను, ఆమె మోడలింగ్ చేస్తుందనీ, పెద్ద పెద్ద ఆఫీసర్లతో, రాజకీయవేత్తలతో బిజినెస్ మాగ్నట్లతో పరిచయం వుందని. అందులో పోలీసు ఆఫీసర్సు కూడా వున్నారట. అందుకే బావ అజ్ఞాతంగా వున్నప్పుడూ, పోలీసుల చేతుల్లో చిక్కుకున్నప్పుడూ అన్ని విషయాలూ ఆమె ద్వారానే నాకు తెలిసేవి. అవే నీకు అంద జేసేవాణ్ని."

"మరి యిప్పుడు వాసు యెక్కడ వున్నాడో కూడా తెలిపి వుండాలే?"

"తెలీటం లేదంటుంది."

నేను ఆలోచనల్లో పడ్డాను.

"ఒరేయ్ రామం! రేపు నువ్వూ నేనూ ఆమె యింటికి వెళ్దామా?"

వాడు ఉలిక్కిపడ్డట్టు నా దిక్కు చూశాడు. "వొద్దు అక్కా! వొద్దు....నీలాంటివాళ్ల వెళ్ళే స్థలం కాదది. నేను వెళ్ళివస్తున్నాననగా—ఆమె కేమైనా తెలిస్తే, వనకు తెలియవలసిందైతే తప్పకుండా చెబుతుంది! నువ్వెళ్ళొద్దు."

నేను మారుమాట్లాడలేదు.

ర ర ర ర

నెల తిరక్కుండానే వనజ దగ్గర్నించి ఒక ఉత్తరం వచ్చింది పోస్టులో.

పరుగు పరుగున పైకి వెళ్ళి, గది తలుపులు మూసి, గడియ వేసి, వణికే చేతులతో కవరు చించి, చటదవటమారంభించాను:

"రమా!

ఇది నా ఆఖరి ఉత్తరం. ఇకమీదట మనమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు వుండవు, మరేలాంటి అనుబంధమూ వుండదు, మన పరస్పర అనురాగ బంధానికి ఆధారమే తెగిపోయింది. ఈ ఉత్తరం నీ చేతికందేసరికి నే నెక్కడుంటానో నాకే తెలీదు.

వాసు పోలీసు చెరనుండి విముక్తుడు కావడంలో మనిద్దరం కూడా యెంతో కొంత పాత్ర వహించాము. అప్పటినించీ అతను విశృంఖల విహారిగా మారాడు. ఆవేశం అవధులు దాటింది. కేవలం కవిత్వంతో తృప్తి పడక, కలానికి బదులు తుపాకీ పట్టి రంగంలో దూకాడు. నేరుగా పార్టీ దళాల్లో చేరి, వారితోబాటు సాయుధ పోరాటాల్లో స్వయంగా పాల్గొనటం మొదలెట్టాడు.

పోలీసులతో ఘర్షణలు సాగుతూనే వున్నాయి. వాటి గురించి అప్పుడప్పుడు నాకు వార్తలు అందుతూనే వున్నాయి. కాని నీ దాకా రానివ్వలేదు. రాంబాబుకూడా చెప్పలేదు. రాంబాబుద్వారా నీకూ తెలిసిపోతుందేమోననే చెప్పలేదు. నీ దగ్గరి కొచ్చినప్పుడు కూడా ఆ విషయం మాట జారకుండా జాగ్రత్తపడ్డాను. నీకు తెలిస్తే ఏం చేసేదానివి? అనవసరంగా మనఃక్షోభకు గురి కావటం తప్ప? నువ్వలా బాధ పడటం నాకు యిష్టంలేదు. అందుకే చెప్పలేదు.

రమా! అలాంటి సాయుధ సంఘర్షణలోనే ఆ మధ్య ఒక నాడు యిరువేపులా యెంతోమంది గాయపడ్డారట. అలా చనిపోయిన వారిలో మన వాసు...."

అంతే, నా గుండె ఆగిపోయినట్టయింది. ఒక్కసారి "వాసూ!" అని యెలుగెత్తి అరిచి నేలకూలాను. ఎంతసేపు అలా స్పృహ లేకుండా పడివున్నానో, తలుపు చప్పుడుకు తెలివొచ్చింది. అమ్మా నాన్న తలుపుమీద దబ దబమని చరుస్తూ "రమా! రమా! తలుపు తీయ్" అంటున్నారు. మెల్లిగా లేచి కూచున్నాను. ఉత్తరం నేలమీద పడివుంది. దాన్ని తీసి మడతపెట్టి పరుపుకింద దూర్చి, కొంగుతో మొహం తుడుచుకుని వెళ్ళి తలుపు తీశాను.

వాళ్ళిద్దరూ ఒక్కసారి గదిలోకి గాబరాగా వచ్చి, నన్ను పట్టుకుని, "ఏమైంది? ఏమైంది?" అని అడుగుతున్నారు.

"ఏం కాలేదు. కల వచ్చింది....పాడు కల" అంటూ వెళ్ళి మంచంమీద కూచున్నాను.

వాళ్ళు నన్ను గుచ్చి గుచ్చి చూస్తున్నారు. అమ్మ నా వొళ్ళు తడిమి చూస్తోంది. "పద, కిందికి పోదాం పద!...." అన్నారు నాన్నగారు.

"మీరు వెళ్ళండి, వస్తాను....నాకేం కాలేదు. ప్లీజ్! వెళ్ళండి" అని వేడుకున్నట్టుగా అన్నాను.

ఇద్దరూ ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ కిందికి వెళ్ళిపోయారు.

అప్పటికి కొంతవరకు కోలుకున్నాను. గుండె దిబ్బరం చేసుకొని ఉత్తరం తీసి చదవటం మొదలెట్టాను....

"....ఆ దుర్ఘటన జరిగిన ఇరవై రోజులకు నా కా వార్త అందింది. అది అంది యిప్పటికి పదిహేనురోజులవుతోంది. అంటే ఆనాడు మీ యింటి కొచ్చినప్పటికే అంతా అయిపోయిందన్న మాట. కాని నాకు తెలీదు. తెలిస్తే నీకు చెప్పకుండా వుండేదాన్ని కాదు. అసలు అలా రాకనే పోదునేమో. నాకు తెలిశాక కూడా నీకు వెంటనే తెలియజెయ్యలేదు. నా గురించి నేను ఆలోచించటంలోనే మునిగి

. య్వెవరినీ కలుసుకోలేదు. రాంబాబును కూడా చూట్టానికి
ాను. తీవ్రంగా ఆలోచిస్తూ కూచున్నాను. ఆఖరికి ఒక
్ణయానికొచ్చాను. నా బంగళాను అమ్మేశాను; నగలూ,
ా అన్నీ అమ్మేశాను. కట్టుగుడ్డలు మాత్రం మిగిలాయి. ఆ
బ్బును యేం చెయ్యాలి అనేది సమస్యగా తయారైంది.
సం ఆర్జించిన ధనం వాసుకోసమే వినియోగించాలని అను
. మొదట నీ పిల్లలు....అంటే, వాసు పిల్లల పేరిట రాద్దా
్నను. కాని నువ్వు ఈ పాపిష్టి ధనాన్ని ముట్టుకుంటావా?
ముట్టుకోనిస్తావా? ఉహుం, నాకే యిష్టంలేదు. పోతే, ఏదైనా
ికి దానం చేద్దామా అనుకున్నాను. కాని అది వాసుకు ఇష్ట
ని తెలుసు. గుళ్ళూ దేవుళ్ళలాగే, ఆశ్రమాలూ బాబాలంటే
ాసుకు అయిష్టమేనని తెలుసు. అందుకని అదీ చెయ్యలేదు.
వాసు చేతిలో ఆ డబ్బు వుంటే ఏం చేసేవాడో వూహించి,
ాను. అంటే, అతని పార్టీలో పని చేస్తూన్న పేద రచయి
కు తెలిసినవారి పేరిట మనియార్డర్లు పంపాను. కొంత
ాత్రం మిగిలి వుంది. అది మూట గట్టుకొని బయలుదేరు
.

ఎక్కడికి? ఈ దేహం, వాసు నిరాకరించిన ఈ దేహం,వాసు
మలినపడ్డ ఈ దేహాన్ని సద్వినియోగపరచుకోవాలన్న
తో, అతని అడుగుజాడలు వెతుక్కుంటూ వెళుతూన్నాను.
ంచుకున్న అభిప్రాయాలూ,నమ్ముకున్న నమ్మకాలూ తొక్కిన
సరైనవి అవునో కావో నాకు తెలీదు. అవి మానవాళి
ికే దారి తీస్తాయో వినాశానికే కారణభూతాలవుతాయో
నాకది అనవసరం. వాసును అనుసరించాలి, అదే నా
వాసు ఏ స్థలాన ప్రాణాలు వదిలాడో అక్కడే నా ప్రాణాలు
అదే నా తుది కోరిక. సహధర్మానికి అదే సహజమార్గం
ాఢ నమ్మకంతో వెళుతూన్నాను.

రమా! ఇందాక 'మన' వాసు చనిపోయాడని రాసినట్టున్నాను
అది పొరపాటు. చనిపోయింది నా వాసు మాత్రమే. నీ వాసు

బ్రతికే వున్నాడు. యెక్కడో కాదు, నీ హృదయ మందిర
నీ ముగ్గురు పిల్లల్లోనూ. వాళ్ళల్లోనే నీ హాసును చూసుకు
సౌభాగ్యవతిగా వర్ధిల్లు.... ఉంటాను.

వ

ఉత్తరం పూర్తి చేశాక చాలాసేపు అలానే
పోయాను. చివరికి లేచి వొంటిమీది వస్తువులన్నీ వొలిచేశా
గాజులు పగలగొట్టాను. నొసటి బొట్టు తుడిచేశాను. జు
విప్పేశాను. తెల్లచీరా, రవికా ధరించాను. మెల్లి మెల్లిగా అ
అడుగు వేసుకుంటూ కిందికి నడిచాను.

హాల్లో కూచుని వున్న అమ్మా నాన్నలు నన్ను చ
భూతాన్ని చూపినట్టు బెదిరిపోయి, దిగ్భ్రాంతితో లేచి నిలుచు

నేను తిన్నగా వెళ్ళి అమ్మ వొళ్ళో వాలిపోయి భోర
ఏడ్చేశాను.



—:సమాప్తం:—

వచ్చే సంచికలో
నవలానుబంధం
యర్రంశెట్టి శాయి
రచన
పీడకలల



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M114 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| | ONO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Bushana |
| Sman | di. Ramya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |